# భారతి

**1966 సెప్టెంబరు**



పురుషోత్తముడు

శ్రీ వేలూరి శివరామ శాస్త్రి

దివ్యానుభూతి

శ్రీ నోరి నరసింహ శాస్త్రి

శిక్ష

శ్రీ తాడిగిరి పోతరాజు



వ్యవస్థాపకులు

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

---

వెల ఒకరూపాయి

Recd 16/9/66

# భారతి

మాసపత్రిక



సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్






సెప్టెంబరు 1966




సంపుటము 43 : : సంచిక 9 :


విడిప్రతి వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## సెప్టెంబరు 1966

# దివ్యానుభూతి

శ్రీ నోరి నరసింహ శాస్త్రి

నిను నే గన్నులజూడ జాలమికి చింతింపన్ రవంతేని, నా
కనయంబున్ భవదీయ మోహన మనోజ్ఞాకార ముల్లంబునన్
ఘనశంపాలతికాప్రభావిశదరేఖాపాళి రూపొంది శో
భన దివ్యోజ్జ్వల రాగరంజిత కలాప్రౌఢిన్ విరాజిల్లుటన్.

నీ పల్కుల్ విన నోచనేరమికి చింతింపన్, శ్రవోవీథిలో
రేపున్మాపు సమస్త వేళల గడున్ హృద్యంబులై నీ ప్రియా
లాపంబుల్ మకరందమంజుల రుచుల్ స్యందించి స్నిగ్ధంబులై
యాపూరించి నదించి మించ మృదులావ్యాజ ప్రసంగంబుగాన్.

నినుపాణిన్ స్పృశియింప నోపమికి చింతింపన్, దృగబ్జాతముల్
తను వాపాద శిరంబు ప్రీతి మధురార్ద్రశ్రీ ప్రసారించి నిన్
దనుపారం గయిసేయు, దూయగ నెడందన్ జూచుచో నీ పునః
పునరాలోకన ముగ్ధలోచన విభా పూర్వస్మృతుల్ పొల్చుటన్.

నీ సౌగంధ్యభరంబు గ్రోలమికి చింతింపన్, భవత్ప్రేమ వీ
చీ సాంగత్య మహోష్మ సౌరభము సస్నేహాస్పృహా హార్దమై
నాసావీథుల నిండి పొంగి హృదయాంతస్సీమ పూరించుచున్
నా సర్వాంగము దివ్యమంగల సుగంధస్ఫూర్తి వాసించుటన్.

నీ సౌందర్యరతిన్ భజింపమికి చింతింపన్, భవద్దివ్య శో
భా సౌభాగ్య మనేకభంగి హృదయస్పర్శన్ రసాప్యాయమున్
నాసా స్వాద్యము నేత్రపర్వము శ్రవోనందంబు ధ్యేయంబునై
నా సర్వేంద్రియ నిత్యభోగ్యమయి ధన్యత్వంబు చేకూర్చుటన్.

నీ గాంధర్వము దూరమాటకును జింతింపన్, భవత్కంఠ సం
యోగాప్తిన్ రసనాగ్రవర్తియయి బింబోష్ఠంబు చుంబించుచో
నా గాత్రంబు శ్రవంబు లక్కులు రసోన్మాదంబునై జొక్కి నీ
రాగాకారత దాల్చి తచ్ఛ్రుతులె యాలాపించుటన్ సర్వదా.

నీ వెందున్నది యేమి యైనదియు జింతింపన్, సదా సర్వథా
నీవే నా సకలాత్మవీథుల సమున్మేషించి, సంపన్న మ
ద్భావంబున్ మధురార్ద్ర దీప కలికా భాస్వత్స్వరూపంబుతో
నావేశించి సుధాపదాధ్వగతి నృత్యశ్రీ ప్రదర్శించుటన్.

---





# పురుషోత్తముడు

## శ్రీ వేలూరి శివరామ శాస్త్రి

ఈ ప్రపంచం దుఃఖం దుఃఖం అని ఇంటిల్లిపాదీ అనేవారే. దార్శనికులు కొందరు తమ పరిభాషలో ప్రపంచకారణం ప్రకృతి అని మాయ అని అవిద్య అని అజ్ఞానమనీ వ్యవహరించారు. కాని వారిలో ఏకొద్దిమందో తప్ప మిగిలినవారందరూ జగత్తుకు ముఖ్యంగానో తటస్థంగానో దేముడు కూడా కారణం అని చెప్పినవారే. ఇలా చెప్పినప్పటికీ ఈ ప్రపంచపు దుంపలోనే తెగులు ఉన్నదనిన్నీ ఈ దుంప తెంపి ఈ ప్రకృతిని ఈ మాయను తప్పించుకొని బయలెక్కాలనిన్నీ వారన్నారు. దీనికి శబ్ద ప్రమాణం కూడా లేకపోలేదు,—

పుట్టుక లేని ఆడమేక ఒకటె ఉన్నది.
అది నలుపు
ఎరుపు తెలుపు రంగులు కలది. అది తన్ను
పోలినవానిని ఈనుతూ
వుంటుంది. పుట్టుక లేని ఒక మగమేక
దానివెంట
కూరిమి గొని వెన్నాడుతున్నది.
పుట్టుక లేని
వేరొక మగమేక భోగములను అనుభవించిన
ఆ ఆడమేకను విడనాడుతున్నది.'[1]

ఉపనిషత్తు—'ప్రకృతి అంటే మాయ. మాయ కలవాడు మహేశ్వరుడు' అని[2] అంటుంది. అంటే ఈ జగత్తు మాయాప్రసూతం. 'జీవేశ్వరు లిరువురూ మాయ అనే వేల్పుటావు లేగదూడలు' అని పంచదశి[3] అంటుంది. కాబట్టి ఈ ప్రపంచానికి దుఃఖమే పాదు.

ప్రకృతి అనే బంధాన్ని తెంపి పారవేసి కోవాలని ఉంటే చతుర్వింశతితత్త్వాలను తెలిసికొని ప్రకృతి పురుష వివేకం చేసి ముక్తి పొందాలని కపిలాచార్యులన్నారు. బ్రహ్మములో వ్యష్టిగతమయిన తన ఉనికిని లయం చేసికోవడం తప్ప వేరే గతిలేదని శ్రీ శంకరాచార్యులవారన్నారు.

తంత్రపు త్రోవ వేరు. ఈ ప్రపంచానికి మూలం సచ్చిదానందమయి అయిన చిచ్ఛక్తి. ఆశక్తియే పరాప్రకృతి. కఠంలో చెప్పబడిన హైమవతి ఉమ ఆ పరాప్రకృతియే, ఆ పరాశక్తియే. ఆ పరాశక్తినే శ్రీ శంకరాచార్యులవారు, 'సర్వజ్ఞుడైన ఈశ్వరునితో నిత్యమూ ఉంటుంది'[4] అని కఠభాష్యంలో అన్నారు.

ఈ పరాప్రకృతి చిచ్ఛక్తి అని దేవీ

---

1. అజా మేకాం లోహిత శుక్ల కృష్ణాం
బహ్వీం ప్రజాం జనయంతీం సరూపాం
అజో హ్యేకో జుషమాణోఽనుశేతే
జహాత్యేనాం భుక్తభోగా మజోఽన్యః.
అజా=పుట్టుక లేనిది, ప్రకృతి, ఆడమేక. అజః=పుట్టుక లేనివాడు జీవుడు, ఈశ్వరుడు, మగమేక.

2. 'మాయాం తు ప్రకృతిం విద్యాన్మాయినం తు మహేశ్వరమ్' (శ్వే)

3. మాయాఖ్యాయాః కామధేనోర్వత్సౌ జీవేశ్వరా వుభౌ. చిత్రదీప—236.

4 'నిత్యమేవ సర్వజ్ఞే నేశ్వరేణ సహవర్తతే

భాగవతం[5]. భగవద్గీత 'యీ ప్రపంచానికి పట్టుకొమ్మ పరాప్రకృతి,[6] అని చెప్పింది. ఈ పరాప్రకృతి సచ్చిదానందమయి కాబట్టి ఇది మూలంగా కల యీ ప్రపంచం దుఃఖమూలం ఎలా ఔతుంది? మరి జడం ఎలా ఔతుంది? ప్రకృతం దుఃఖమూలమనీ జడమనీ మాయ అనీ తోచవచ్చు. కాని లోతుకు దిగిచూస్తే దుఃఖమయమని కాక ఆనందమయమని తెలుస్తుంది. 'ఆనందంవల్లనే ఈ భూతాలు పుట్టి ఆనందప్రవేశం చేస్తున్నవి' అని తైత్తిరీయం[7] అంటున్నది. కాగా ఈ ప్రపంచ మూలం అపరాప్రకృతి కాదు. ఈ అపరాప్రకృతి మనలో ఉన్న భగవానుని ఆవరించి ఉన్నటులే ప్రపంచంలోనూ మనబ్రదిమిలోనూ ఉన్న ఆనందమును గూడా ఆవరించి ఉన్నది. అపరా ప్రకృతి పరాప్రకృతికి కవచం. ఇది ప్రకృతం జడం. ఇది 'స్తబ్ధత్వం పొందిన సంవిత్తని', అభినవగుప్తుడు మాలినిలోనూ ప్రత్యభిజ్ఞలోనూ అంటాడు. ఈ అపరాప్రకృతియొక్క ఆవరణం దాటి పరాప్రకృతిలో దివ్యంగా ఆనందమయంగా జీవించడమే మనకు లక్ష్యం.

సగుణ, నిర్గుణ, బ్రహ్మవాదులు పరాప్రకృతి జీవాత్మకం అని అన్నారు కాని గీత 'జీవీభూతా' అని అనివుంటే వారు చెప్పిన అర్థం అతికేది. కాని గీత పరాప్రకృతిని జీవాత్మకగా చెప్పదు, మరి 'జీవభూతా' అని చెపుతుంది. జీవభూతా=జీవత్వం పొందినది అని అర్థం. అంటే పరాప్రకృతియే సర్వజీవ స్వభావం అని తాత్పర్యం. 'వృద్ధిరాదైచ్' సూత్ర—మహాభాష్యంలో 'ప్రమాణభూత ఆచార్యః' మొ. ఘట్టము, దానిమీది కైయటోద్ద్యోతాలూ 'బ్రహ్మభూతః ప్రసన్నాత్మా' 18—54 గీతా శాంకరభాష్యమూ చూచేది— 'బ్రహ్మభూతః=బ్రహ్మప్రాప్తః': పరాప్రకృతి అంతా జీవ మాత్రమే, మరి పరాశక్తి కాదు అని ఉద్దిష్టమయితే చ్విప్రత్యయాదులలో ఏదో ఒకటి చేర్చాలి. "...సంపద్యకర్తరి'—5—4—50, 'అభివిధౌ సంపదాచ' 5—4—53 చూచేది. ఈ పరాప్రకృతి ఇంతటిలోనే ఈజీవుల పొలిమేరలోనే కట్టుపడి ఉండలేదు. ఈ పరాశక్తియే, ఆద్యాశక్తి 'అమ్మల గన్న యమ్మ, ముగు రమ్మల మూలపుటమ్మ.' పరాప్రకృతిన్నీ పరాసంవిత్తున్నూ అనగా పరమేశ్వరుడున్నూ ఒకటంటే ఒకటి. జీవుడు భగవదంశం. 'మమైవాంశః'[8].

జీవజగత్తులు భగవచ్ఛక్తిలో ఒక బిందువు. నానావిధ జీవులు ఒక భగవంతుని యొక్కయే నానావిధ రూపాలు, నానా వ్యష్టిగత రూపాలు. ఇలా అయినప్పటికిన్నీ మానవుడు ఈ అపరాప్రకృతిలోనే గూడు కట్టుకొని ఉన్నాడు. మానవ సామాన్యం తన్ను సమగ్రంగా వికసింపజేసికొని భగవద్ధర్మమునున్నూ భగవత్ప్రకృతినిన్నీ పొందవలసి ఉన్నది. ఈ సంసారంలో దివ్యజన్మ ఎత్తవలసి ఉన్నది. దివ్యకర్మ చేయవలసి ఉన్నది. మరి వంతా చింతా రవ్వారటూ మొదలయినవాని కతీతుడై భగవంతుని వలె ఈ విశ్వలీలలో అనంతమయిన ఆనందం అనుభవించవలసి ఉన్నది. ఇందుకోసమే అయివుంటుంది ఈ పరాప్రకృతి తన్ను భగవత్పాత్త

5. నవమస్కంధం ప్రథమాధ్యాయం చూచేది.

6. ....ఇతస్త్వన్యాం విద్ధి మే ప్రకృతిం పరామ్, జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్. గీత-7-5

7. 'ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే..'

8. గీత—15—7 మహాలనుడైన భగవానుడే 'విశ్వలీల కొఱకు సంకోచించెంది ంగా లోకంలో జీవుడుగా ఉన్నాడు, జీవత్వం పొందాడు—కావాలని, ఆ జీవుడే మళ్ళా బ్రహ్మభూతుడవుతాడు.

మండి గుంజుకొని బయటపడి తానే మూల స్వభావమై విశ్వమును ధరించి ఉన్నది. అయితే మనిషి యిపుడు సంసారంలో సుఖదుఃఖాల ఉయాలలో ఊగులాడుతున్నాడు. ఇది త్రిగుణాత్మక మయిన అపరాప్రకృతి అట.మనిషి ఇపుడు ముదిమి జవ్వనము, తెగులు ఆరోగ్యమూ, పుట్టూ చావూ మొదలయిన జంటలలో అంటుకొని, ఉన్నాడు. దీనికిన్నీ ఒక ఉద్దేశ్యమూ ప్రయోజనమూ ఉన్నది. ఈ అపరాప్రకృతి పరాప్రకృతి చేసిన సృష్టి. ఈ అపరాప్రకృతిగుండా దేహ ప్రాణ మనోవికాసం పొందియే పరాప్రకృతిలో దివ్యజీవన లాభం కలిగించుకోవాలి. అవిద్యచే మృత్యువును దాటె విద్యచే అమృతత్వ లాభం పొందాలి. విద్య(శుద్ధవిద్యాతత్త్వం) అంటేగూడా పరాప్రకృతివిశేషంఅనియుండుముందుతెలుస్తుంది.

మనకు అపరాప్రకృతి నిర్బంధం తప్పనటులు తోస్తుంది. మనకేకాదు సాంఖ్యాచార్యులకూ యోగాచార్యులకూ వేదాంతాచార్యులయావన్మందికీగూడా అలాగే తోచింది. 'కార్యకరణ రూపాలయిన ప్రకృతి గుణాలు సత్త్వరజస్తమస్సులే కర్మ చేస్తున్నవిగాని మనం చేయడం లేదని గుణకర్మల విభాగం తెలిసికొని వైదొలగేది. మనః ప్రాణశరీరాలలో సంభవించే రోగభోగాలు కామక్రోధాలు సుఖదుఃఖాలు జాగ్రత్ సుషుప్తులు మొదలయిన ద్వంద్వాలు మనవి కావు. ఇవన్నీ అపరాప్రకృతివి. మనం వీనికి అతీతులం. ప్రకృతి చేసుకుంటూపోయే పనులకు పురుషుడు ద్రష్ట లేక సాక్షి. మనమొక నాటకం చూస్తూ అందలి నాయికా నాయకుల సుఖదుఃఖాలను సంయోగ వియోగాలను వేదనానందాలను అనుభవించినట్లు సంసార నాటకంలోనూ అనుభవిస్తున్నాంకాని ఇవేవీ మనవి కావు. మన కివేవీ అంటవు. పురుషుడు అచలుడు నిర్గుణుడు నిష్క్రియుడు. కుంటివాడు. ప్రకృతి గుడ్డిది. ఇరువది నాలుగు తత్త్వాలనూ తరచి చూడండి. వీనిలో వేనికీ ద్రష్టృత్వం లేదు. పురుషుడే ద్రష్ట అని శోధించండి. ప్రకృతి పురుష విచారం చేసి చిత్తాధికారం అవసితం చేసికోండి. వీరారు పురుషు లయిపోతారు' అని సాంఖ్యం బోధించింది. సాంఖ్యసారాంశమిదే కాబట్టి ప్రకృతి పాలమునుండి జీవననాటకము నుండి బుద్ధిని మరలించి జ్ఞానాత్మకు, మహదాత్మకు, వెనుక ఉన్న శాంతాత్మలై పోవడం[9] పురుషులై పోవడం ముక్తికి అర్థం.

అద్వైతంకూడా 'సంసారం విడిచి సన్న్యాసం స్వీకరించి నైష్కర్మ్యసిద్ధి పొంది నిర్గుణ బ్రహ్మభూతులు అవండోయ్' అని బోధించింది. ఇదే అద్వైతముక్తి.

'ఈ అపరాప్రకృతియే మనకు సొంత ఇల్లు కాదు, ఈ ద్వంద్వాల ఎడా పెడా దెబ్బలు తింటూ కూచోడమే మన పని కాదు, చస్తూ పుట్టుతూ పుట్టుతూ చస్తూ ఉండడమే మన మొగాన రాసిపెట్టి ఉండ లేదు' అని గీత ఇక్కడే తిష్ఠ వేయలేదు.. అచలుడూ నిష్క్రియుడూ అక్షరుడే సత్యమయితే మానవుడు ఆ అక్షరపురుష భావం పొందితే గుణాల ప్రేరణ ఆగిపోయేది, సంసార నాటకద్వారం మూతపడేది. కాని గీత యీ అక్షరుని కంటె పై ఇంకొక సత్యం ఉపదేశించింది. అది పురుషోత్తమతత్త్వం. అక్షర పురుషుడీ పురుషోత్తమునకు ఒక ముఖం. పురుషోత్తమునిలో అక్షరపురుషుని శాంతియున్నూ నిష్క్రియతయున్నూ పునాదిగా ఉన్నవి. పునాదిగా ఉన్న ఆ నిష్క్రియుడే పురుషోత్తమ రూపంతో

9. 'జ్ఞాన మాత్మని మహతి తద్య చేచ్ఛాంత ఆత్మని.' కఠ

ఆవిర్భవించాడు. విశ్వమునందలి ఎడతెగని కర్మ ధారతో నిజప్రకృతియైన పరాప్రకృతితో ఏకమై జగన్నాటకం నిర్వహిస్తున్నాడు —'క్షరస్సర్వాణి భూతాని'[10] అలపూ సొలపూ లేకుండా కర్మ చేస్తున్నాడు. 'వర్త ఏవ చ కర్మణి'[11]. ఆ పురుషోత్తముడే కురుక్షేత్రంలో భీష్మద్రోణాదులను ఎప్పుడో చంపి ఉంచాడు. అతని ఇచ్ఛచే అతనిదే ఐన ప్రకృతి ద్వారా లేక శక్తి ద్వారా ఈ జగత్తులో ప్రతిపనీ నియంత్రితమై నిర్ధారితమై జరిగిపోతూంది. — 'యాథాతథ్యతోఽర్థాన్ వ్యదధాచ్ఛాశ్వతీభ్యస్సమాభ్యః—' (ఈశ.౮). ఆకాశ విధృతమై ఉండి గాలి ఎట్లా అంతటా వీస్తూండేలాగే విశ్వం ఆ మహాకూటస్థ— అక్షరసత్తచే విధృతమై నిలిచిఉంది, విజృంభిస్తూనూ ఉంది. కాని ఆ పురుషోత్తముడో కూటస్థుడయిన అక్షరుని కంటె పైవాడు కాబట్టి అందరకూ పురుషోత్తమ లాభం కలగాలి. అదే శ్రేష్ఠగతి.

అపరాప్రకృతియొక్క అహంభావం నుండి ముక్తులం కావడానికి మువెమ్మొదట అక్షరపురుషుని శాంతమయిన సాక్షిభావంలో నెలకొనాలి. ఈ అక్షరాత్మ సర్వభూతాల ఏకాత్మ. ఈ అక్షరపురుషునిలో ఉండి మనం సర్వభూతాలతో ఐక్యం పొందగలం. మనం ప్రకృతిని బట్టి కర్మ చేసే స్వభావం కలవారం. కాబట్టి మనం సంసారంలో చేయదగిన కర్మల నన్నిటినీ పురుషోత్తము నుద్దేశించి యజ్ఞరూపంగా చేయగలం. మన కర్మ అంతా మన బ్రతుకు అంతా మన కధీశ్వరుడైన పురుషోత్తమునకు సమర్పించి ఎల్లప్పుడూ ఆ పురుషోత్తముని భజించి అన్నిభూతాలలోనూ ఉన్న అతనిని సేవించి అతనిని అందరకంటెను అన్నిటికంటెను ఎక్కుడుగా ప్రేమించి అతని భావం పొందుతాము,—'మద్భావ మాగతాః'[12]. అప్పుడు మనలో అక్షరపురుషుని పరమశాంతి ప్రతిష్ఠితమవుతుంది. ఇట్లా ప్రతిష్ఠితమయితే అతని శాంతి, సమత్వం, అనాసక్తి, మొదలగు వానితో బాహ్య ప్రకృతి రూపాంతరంపొంది ఈ ప్రపంచంలో పురుషోత్తముని ఇచ్ఛనూ కర్మనూ చేసే యంత్రం అవుతుంది—నిమిత్తమాత్రం. ఇది గీతచెప్పిన పూర్ణయోగం (Integral Yoga). దీనిలో కర్మ భక్తి జ్ఞాన యోగాల అపూర్వ సమన్వయం కనబడుతుంది.

గీత అంతా ఒక యోగం. అందులకనే 'భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే' అని ప్రతి అధ్యాయం చివరా గద్యలో ఉంటుంది. అయితే ఇందులో పాతంజలసారం లేకపోలేదు. గీత, మనస్సును ఏకాగ్రం చేసుకోవడానికి అది ఉపాయమాత్రంగా ఉపయోగపడుతుందని చెప్పడానికి వినియోగించుకొంది. అయితే గీత చెప్పిన మహాయోగ మేమిటంటే—మానవులు తమతమ సత్తను యావత్తూ భగవదభిముఖం చేసికోవడం. అది ఏలాగంటే 'కోరిక యేమీ లేకుండా మనుజు లందర యెడలా వస్తువు లన్నిటియెడలా ఘటన లన్నిటి యెడలా సమభావం ఉంచి భగవంతు నుద్దేశించి యజ్ఞరూపంగా[13] ఏయే కర్మలు చేయవచ్చునో ఆయా కర్మలలోపల నుండి అతనితో యోగం కలిగించుకోవడమే' గీత చెప్పే కర్మయోగం. ఈ కోరిక లేకపోవడానికీ సమత్వానికీ యజ్ఞభావానికీ భిత్తి ఏమిటి? ఆత్మజ్ఞానం లేక భగవద్ జ్ఞానం. ఈ జ్ఞానానికి

10. గీత—15.16

11. గీత—3-22.

12. 4—10. (గీత) 'నిమిత్తమాత్రం భవసవ్యసాచిన్.

13. 'మద్యాజీ మాం నమస్కురు.'

ఈ కర్మకూ పూర్ణపరిపాకము సార్థకత ఏమిటయ్యా అని అంటే అనన్య భక్తీ, అనంత ప్రేమా. కర్మత్యాగమే కొందర కొందర ఆచార్యుల ఉపదేశం.

'దివ్యకర్మ చేసి పరచైతన్యంలో దివ్య జన్మలాభం పొంది తదభివ్యక్తి రూపంగా కూడా దివ్యకర్మ చేయుమ'ని గీతోపదేశం.

## పురుషోత్తమతత్త్వం
## సగుణపురుషుడు

పురుషోత్తముడు క్షరాక్షరులకు అతీతుడని[14] గీత స్పష్టంగా చెప్పింది. ఇతడు సృష్టికర్త. ఈశ్వరుడు. కాబట్టి ప్రాచీనాచార్యులు కొందరు చేసిన విభాగంలో చెపితే సగుణపురుషుడు.

కురుక్షేత్రయుద్ధంలో అర్జునునకు సారథ్యం చేసిన అతడే మానవశరీరంతో అవతరించిన పురుషోత్తముడు. ఈతడు 'నాకు మిగిలిపోయిన దేదీ లేదు'[15] అని అంటాడు.

గీత ఏడవ అధ్యాయం నాలుగు ఐదూ శ్లోకాలలో పరాపర ప్రకృతుల పునాది వేసి ఎనిమిదవ అధ్యాయంలో అక్షర పరబ్రహ్మ యోగం వివరించి పదునైదవ అధ్యాయంలో ఈ క్షరాక్షరపురుషులనే పునాది మీద పురుషోత్తమ తత్త్వాన్ని నిలుపబెట్టడం ఆలోచించి తెలిసికొనవలసిన గొప్ప విషయం.

నిర్గుణ బ్రహ్మవాదులకు సగుణపురుషుడు మాయే. వారి పురుషోత్తముని అక్షర బ్రహ్మము కంటె అధమపురుషుడని వ్యాకరించినట్లయినది.

మానవులలో ఉన్న ఆత్మయే మానవాత్మ అని అనుకొని మనం ఆ ఆత్మనుగూడా మానవుడని అనుకొంటాం. కాని ఈ మానవత్వం, ఇప్పటి—ఈకాలపు—రూపం. ఇది బాహ్యరూపమే కాని స్వరూపం కాదు. ఇది మానవులలోనే ఇరికికొని ఉండలేదు. లోగడ ఇది మనుష్యుల కంటె వేరైన ప్రాణులుగా పుట్టింది. క్రమక్రమంగా వికసించి ఇకముందు మానవత దాటిపోవలసి ఉన్నది, దాటిపోతుంది. ఎందువల్లనంటే, ఇది భగవంతుని యొక్కయే అంశం. దీనిని అపరాప్రకృతి ఇపుడు కప్పి ఉంచింది. ఈ కప్పును మెలమెలగా తొలగించుకొని జీవుడు తనకు మూలమయిన భగవత్ స్వరూపాన్ని పొందవలసి ఉన్నాడు. అల్లపుడే వ్యష్టి జీవులలో భగవత్ ప్రకాశం పూర్ణమవుతుంది. అదియే యీ విశ్వలీలలోని గూఢరహస్యం.

భగవంతుడే సనాతన జీవుడు. 'జీవభూత స్సనాతనః'. శంకరుల భాషలో మళ్లా 'జీవో బ్రహ్మైవ నాఽపరః'.భగవంతుడు ఒక్కడే, మళ్లా అనేకుడు. లీలకోసం అతడు కోరి తన శక్తిని సంకోచం చేసికొంటాడు, చేసికొన్నాడు. ఇలా చేసికొనియే అతడు జీవుడైనాడు. తన మూలసత్తచే జీవుడూ భగవంతుడే. కేవల ప్రకృతిచే శక్తిచే భగవంతుని ప్రకృతి లేక శక్తియొక్క అంశం. అంశ స్వరూపుడయిన జీవుడు ఎపుడు భగవత్ సదృశు డవుతాడో, సాధర్మ్యం పొందుతాడో అపుడే భగవంతునితో జీవుని ప్రేమ మేళనం పూర్ణమవుతుంది. తానే తన ప్రేమను అనుభవించడానికి భగవంతుడింతై అంతైనాడు.

నిండు జ్ఞాని పురుషోత్తమునిలో క్షరాక్షరులను ఏకంగా కనుగొంటాడు. అతడు సర్వభూతాలలోఉన్న పరమాత్మను సకలశక్తుల కధీశ్వరుని విశ్వబాహ్యాభ్యంతర వ్యాప్తుని దాపునా దవ్వునా ఉండే శాశ్వతసత్తను ప్రేమిస్తాడు, పూజిస్తాడు, అతనిలో నిష్ఠ పొందుతాడు. ఆ జ్ఞాని కేవల మానసికజ్ఞానంతోగాక హృదయ

14. గీత—15—16, 17.
15. 'మత్తః పరతరం నాన్యత్కించిదస్తి' 7—7.

భావావేగంతోగాక కేవల కర్మలోగాక సమగ్రమయిన తన ప్రకృతిచే ఎల్లలేని అక్షరుని సమత్వమునూ శాంతినీ ఐక్యమునూ తన మనోహృదయప్రాణదేహాలలోనికి రావించికొని దివ్యప్రేమ, దివ్యకర్మ, దివ్యజ్ఞానాలను, విడదీయ రాకుండా సమగ్రంగా ప్రతిష్ఠిస్తాడు.

ఉపనిషత్తులు అక్కడక్కడ బ్రహ్మను 'నిర్గుణోగుణీ' అని చెప్పినట్లే గీత బ్రహ్మను సగుణ మనిన్నీ నిర్గుణమనిన్నీ చెప్పింది. ఆ సగుణ నిర్గుణోభయరూపమే పురుషోత్తమతత్త్వం. క్షరాక్షరులు గీతాపురుషోత్తముని రెండు రూపాలు. పురుషోత్తముడు చైతన్యరూపుడు. సక్రియమైన ఆ చైతన్యంయొక్కయే రూపం ఆ పురుషోత్తమునియొక్కయే ప్రకృతి. పురుష ప్రకృతులు మూలతః వేరు కావు.

అపరాప్రకృతి మాయ లేక అవిద్య. ఇది పరాప్రకృతికి లేక శుద్ధ విద్యాతత్త్వానికి దిగువది. ఇదిన్నీ పరాప్రకృతియొక్కయే సృష్టి. ఆ పరాప్రకృతియొక్క చీకటి చాయ.

గీతారహస్య మెరిగినవారు సక్రియమైన భగవత్ సత్తను మిథ్య అని అనరు. నిర్గుణ బ్రహ్మవాదులు శక్తిని మిథ్యగా మాయగా,నిర్ధారించుకొన్నందువల్ల 'జీవభూతాం'కు 'జీవాత్మకం' అని అర్థం చెప్పవలసి వచ్చింది. దానికి తోడు పురుషోత్తమ పదానికి నిర్గుణబ్రహ్మము అనే అర్థం సంగతం కావడానికి 'కూటస్థోఽక్షర, ఉచ్యతే' అనేటప్పుడు 'అక్షర' పదానికి మాయాశబల బ్రహ్మ[16] అని చెప్పవలసి వచ్చింది.

శ్రీ శంకరాచార్యుల వారు ఎక్కడ బ్రహ్మజిజ్ఞాసను ముగించారో శ్రీరామకృష్ణ పరమహంస అక్కడ శక్తిజిజ్ఞాస ఆరంభించారు. దానిని శ్రీ అరవిందులు తమ Essays on Githa లో ప్రపంచించారు. శ్రీరామకృష్ణుల ఉపదేశం ఇది—

అతడు ఒకరూపుతో నిత్యుడు, ఇంకొక రూపుతో లీల. శాస్త్రం అతనిని సగుణు డనిన్నీ నిర్గుణు డనిన్నీ చెబుతుంది. జీవ జగత్తులుగా ఇరువదినాలుగు తత్త్వాలుగా అయిన దతడే. నిష్క్రియు డయినప్పుడతనిని బ్రహ్మమని అంటాము. సృష్టి స్థితి సంహారాలు చేసేటప్పుడు శక్తి అని అంటాం. బ్రహ్మ శక్తీ వేరు కావు. నీరు నిలిచి వున్నా నీరనే అంటాం, కదలి పారుతున్నప్పుడూ నీరనే అంటాం. నిండు జ్ఞానమూ నిండు భక్తీ ఒక్కటే. నేతి, నేతి, విచారణ అగినప్పుడు బ్రహ్మజ్ఞానం. అటుపిదప దేనిని వదలివేశామో దాన్నే మళ్లా పట్టుకుంటాం. డాబా మీదికి ఎక్కేటప్పుడు జాగ్రత్తగా ఎక్కాలి. పైకెక్కి చూస్తే పైభాగం ఏ ఇటుకలతో ఏ యిసుకతో ఏ గారతో తయారు చేశారో క్రింది మెట్లు గూడా ఆ యిటుకలతోనే ఆ యిసుకతోనే ఆ గారతోనే తయారీ అని తెలుస్తుంది. బ్రహ్మసత్తాయే జీవుడూ జగత్తూనూ.

ఎవడు బ్రహ్మమో అతడే కాళి, అతడే శక్తి. ఎవడు పురుషుడో అతడే ప్రకృతి. మనం ఆ శక్తినే ఆ ప్రకృతినే 'అమ్మా' అనీ 'ముగురమ్మల మూలపుటమ్మా' అనీ అనేది.

శ్రీరామకృష్ణుల యీ కాళియే యీ శక్తియే యీ ప్రకృతియే గీత చెప్పిన, తంత్రం చెప్పిన, పరాప్రకృతి పరాశక్తి. ఈమెయే చిన్మయి చిద్రూపిణీ అయిన బ్రహ్మశక్తి. సదాశివ—ఈశ్వర సద్విద్యలుగా వెలసిన ఈ పరాశక్తియే ఈ పరాప్రకృతియే తదభిన్నమైన పురుషోత్తమ తత్త్వమే శ్రీ అరవిందుల Super Mind. దాని సంగ్రహం ముందు.

---

16. కూటో మాయా వంచనా జిహ్మతా కుటిలతేతి పర్యాయాః. అనేక మాయాదిప్రకారేణ స్థితః కూటస్థః సంసారబీజానంత్యాన్న క్షరతీ త్యక్షరః 15—16.

# ఘోర పాటు

## "తల్లావఝ్ఝల"

నే ను

చిక్కిపోయిన వారు శ్రీ రావుగారు
కారణం బేమియో! గ్రామాంతరమున
కరిగి యీ యుదయుంబె తిరిగి వచ్చితిని—
ఇచటి విశేషంబు లేవియో యెరుగ.

రా వు

రెండు వారాలు జ్వరముతో పండుకొంటి
ప్రక్క మీదనె: మిక్కిలి పట్టి పీల్చి
పిప్పి చేసెను, మొన్ననే తెప్పరిలితి:
ఒడలిలో బలహీనత సడల లేదు.

నే ను

వ్యాధి వర్ధిల్లెనా యేమి? వైద్య శక్తి
మూలమున తేరుకొంటిరా మొన్న మొన్న?

రా వు

భేషజంబున కాకున్న, భేషజంబె,
మరి యొక విధాన మరలించె మరణ గతిని—
చిత్రముగ నుండు వివరించి చెప్పు నెడల—

నే ను

విస్తరమ్ముగ దెలిపిన విందు నేను.

రా వు

అర్ధ రాత్రము కానోపు, అపుడు నాకు
స్వప్నమో మాంద్యమో కాక జాగరణమొ—
స్థితిని వివరింపజాల స్పష్టీకరించి,
కాని క్రమముగ వివరింప గలను మీకు.

వంకర కత్తులు చంక దుడ్డులును
బుగ్గ మీసములు అగ్గిని కురిపెడి
మిట్ట కన్నులును మిడి మిడి గ్రుడ్లులు
నీలి బట్టలును నెత్తి కోకలును—
భీకర మూర్తులు పీకను వచ్చిరి.

కనుగొని నంతనె కంపము కలిగెను!
ఎవ్వరు మీరని యెటులో యడిగితి.

యముని కింకరుల మను నెరుగ వోకో!
సరి! అందరకును స్వాగత మిదియే!
ఏతెంచితి రిట, నేమి కార్యమో?

నా ప్రశ్నమునకు నవ్వి అందొకడు
అర్య, మీ కొరకె అరుదెంచితి మనె.

నను గొనిపోవగ చనుదెంచితిరా!
అరసి చూడదగు, పొరపడి యుందురు.

మీరు రావుజీ కారా చెప్పుడు!
అని వారలు నన్నడిగిరి నవ్వుచు.

అవును, సత్యమే: అయిన రావుజీ
అని యెడి నామము— కను గొన్నార
ఎందరు కలవా—రింటి పేరు నిహ
రెరుగక వచ్చితి, రింత ప్రమత్తత
సముచిత మగునా యమదూతల కని

పలికితి: వెడలిరి భటులు తోడనే!
నిండు నిద్రలో నిఖిలము మరచితి.

మొన్నటి రాతిరి ముగ్గురు రావులు
అనియెడి వారలు మన నగరములో
అపమృత్యువు పాలైన వారలని
గత దిన సాయంకాలము తెలిసెను.

నే ను
మీరు రావుజీ, మిక్కిలి ధన్యులు!
బుద్ధి విభవమున పొరపెట్టితిరే
యముని కింకరుల యంతటి వారిని!

రా వు
శివానుగ్రహముచే జీవముతో
కనుగొన గలిగితి క్రమ్మర మిమ్ముల!

# శిక్ష

శ్రీ తాడిగిరి పోతరాజు

చుట్టూ పరికించి చూశాను—బండి లేదు—జీతగాళ్ళు లేరు. 'స్టేషన్' ఆవల చెట్లనీడలో సవారి బండి విడిచిన అజ అయిపూ లేదు. నన్ను దింపిన రైలు రెండు నిముషాల్లోనే కూత కూసుకొంటూ జారి పోయింది—జెర్రిపోతులా.

ఆ 'స్టేషన్'లో దిగినవాళ్ళు నేను, మరి కొందరు పాలమ్ముకొనే వాళ్ళూ-వాళ్ళ కావిళ్ళూ, పాల బిందెలూ.. రైల్వేకూలీ నన్ను పరామర్శిస్తున్న చూపులతో సమీపించి టిక్కెట్టు తీసికొని వెళ్లిపోయ్యాడు.

నాలుగయినా ఎండ చిటు—చిట లాడుతోంది.

ప్లాట్‌ఫారం బారుకు గానుగచెట్లు—ఆ చివర ఒకటి, ఈ చివర ఒకటి దీపస్తంభాలు— ఎర్రటి అక్షరాలలో ఊరిపేరు మూలగ వ్రాసి ఉంది ఆ దీపాలపై.

ఆ గానుగ చెట్ల మధ్య ఒక చెడిపోయిన బోగి—అది స్టేషన్‌మాష్టారు కార్యాలయం. స్టేషన్ పరి హద్దులను సూచిస్తూ ఒకవైపు ముళ్ళతీగె.

జనసంచారంలేని స్టేషన్—ఉదయం పట్నంపోయే పెరుగుబండి—సాయంత్రం పట్టణంనుండి వచ్చే తిరుగుబండి—రెండు పాసింజరు బళ్ళూ రెండు నిముషాలు మాత్రమే ఆగే కుగ్రామం.

గ్రామానికి స్టేషన్‌కు దాదాపు రెండు మైళ్ళ దూరం. నాల్గయిదు గ్రామాలకు, అయిదారు కుగ్రామాలకు మిణుకు మిణుకుమనే చిన్న కోడిగుడ్డు దీపంలా ఉంది ఆ స్టేషన్.

నిర్మానుష్యంగా నిరాడంబరంగా ఉంది.

సంచి, చేతో పట్టుకొని గానుగచెట్ల నీడలోకి వెళ్లి చతికిలబడ్డాను—చెట్టు మొదలు కానుకొని.

ట్రాన్సిస్టర్ ఏరియల్ పైకిలాగి 'గుర్'—'బర్' మని పించేసరికి కొండపక్కన డొంకలో మేఘంలా దుమ్ము కనిపించింది. రెండెడ్ల సవారిబండి దూసుకొస్తోంది. గిత్తల గిట్టల రాపిడికి దారంతా ధూళిధూసరితమై పోతోంది.

ట్రాన్సిస్టర్ కేస్ మూసి భుజానికి తగిలించాను. బండిని అల్లంతదూరానే ఆపి జీతగాడు పరుగెత్తుకొంటూ వచ్చాడు—ఎర్రని ఊలు అల్లిన చంద్రకోల భుజాన వేసికొని.

"దణ్ణం దణ్ణం బాబుగోరూ...ఈ లంకణాల బోటు ఎదవది—ఏరోజు సూసినా పొద్దుగూకివాకే వత్తది. ఈయాల తమ రొత్తన్నా రనేనూ సరిగ్గ యాలకొచ్చిపోయింది. దీని తప్పదియ్యా-నేను ఇప్పుడేం తొందర్లే అని పాలుమాలా?..."అంటూ. బట్టల సంచి బండిలో పెట్టి నొగలు పట్టుకున్నాడు.

"మరి నీవెక్కవురా?"...వాలుగా ఆనుకొని కూర్చుంటూ అడిగాను.

"వద్దు—వద్దు బాబుగారూ..ఇవనలే అలవారుతున్న గిత్తలు. ఈ డొంకలో నమ్మటానికి వీల్లేదు. ఆ పగ్గాలు ఇటు ఇసిరెయ్యండి."

"ఒరేయ్..ముందు నాకు మంచినీళ్ళు కావాల్రా."

"ఇక్కడ మంచి నీళ్లెక్కడివి? అంతా ఉప్పు నీరే. మళ్ళీ మన ఊరుపోతేనే...లేకపోతే ఆ తుమ్మల చెరువుకాడ్నన్నా" అన్నాడు.

మువ్వలు గలగల లాడివస్తూ, కోడెలు ముందుకు కదిలాయి.

మిట్టపల్లాలుగా, గుంటలతో, గుండురాళ్ళతో పాము మెలికల్లా తిరిగిపోతూన్న డొంక. నడుం విరిగి

పోసాగింది. ఎంత జాగ్రత్తగా కూర్చున్నా కుదుపులకు వళ్ళు హూనమైపోతోంది. చూస్తూ చూస్తుండగనే తుమ్మల తోపులో ఉన్న నల్లచెరువు కట్ట ఎక్కింది బండి.

చెరువులో నీళ్ళు చూసి నాకు ప్రాణం లేచి వచ్చింది. అనుమతి అడిగేలోపునే జీతగాడు వొగలు అదిమిపట్టి ఎడ్లను నిలిపాడు. మోకాళ్ల లోతు వరకూ దిగి పది దోసిళ్ల నీరు పట్టించాను. చన్నీటితో ముఖం మరోసారి అద్దుకొని బండెక్కాను.

బండి ఊళ్లో ప్రవేశించింది. పల్లెటూరి పిల్లలు నన్ను వింతగా చూస్తూ సినిమాబండి వెంట ఎడ్వర్టైజ్‌మెంటు కాగితాలకు వెంటబడినట్లు రాసాగారు. అందరి ముఖాల్లోనూ స్వాగతం కనిపించింది. ఆడవాళ్లు చంటిపిల్లల నెత్తుకొని వీధి వాకిళ్లకు చేరబడి వింతగా నాకేసి చూడసాగారు.

బండి దిగి మా ఇంటిలోనికి ప్రవేశించాను.

"'ఏంరా? చిన్నాడా?... రెండు రోజులనాడే వస్తానని ఏంచేస్తున్నావ్?..." నోరారా పిలిచింది మా అమ్మమ్మ.

ఆ పిలుపులో ఉన్న ప్రేమ—మార్దవం కోసం తహతహలాడి రెక్కలు కట్టుకు వాలిన నేను ఆ పలుకులతో ఎంతో సంబరపడిపోయ్యాను. నాకు మైనారిటీ చెల్లిపోయిందని భారతప్రభుత్వం గుర్తించి గౌరవనీయమైన ఓటు హక్కు కల్గించినప్పటికీ ఆమె నన్ను ఇంకా 'చిన్నాడా'—'చిట్టీ' అంటూంటే దువ్వుతున్న కోడ్ది మరింతగా ముడుచుకుపోయ్యే పిల్లికూనలా అయిపోయ్యాను. ఆమె ఎన్నో ప్రశ్నలు వేసింది. మా ఇంట్లో వాళ్లనందరినీ పేరుపేరునా అడిగి వాళ్ల సుఖసంక్షేమాలు తెలిసికొని నిశ్చింతగా నిట్టూర్పు విడిచింది.

"అయ్యో—నా మతిమరుపు పాడుగానూ..వేడి నీళ్లు ఆరిపోతాయి..లే.. తలంటి పోసుకుందువుగాని.. పాడురైలు—ఆ బొగ్గంతా తలనిండా ఒంటినిండా పడుతుంది..ఆ గాడె మీద తుండుగుడ్డ ఉంది చూడు.. చుట్టుకో" అంటూ ఆమె స్నానానికి ఏర్పాట్లు చెయ్యటానికై లోనికెళ్లింది జీతగాడ్ని కేకవేస్తూ.

నన్ను వింతగా అవలోకిస్తూన్న ప్రేక్షకలోకం—నన్ను మా ఇంటి వద్ద దిగవిడిచి వెళ్తుందనుకున్న ఆ బాలుర పరివారం అలానే మా పంచలో నిలబడి పోయారు పందిరి గుంజల్లా. మూడు నాల్గు సంవత్సరాల నుండి దాదాపు పదిసంవత్సరాల వయస్సులో ఉన్నవాళ్లు. అందరూ నాకేసి నిర్నిమేష దృక్కులతో చూస్తున్నారు.

కాని ఆ పిల్లవాడు-ఎర్రగా బొద్దుగా ఉన్నాడు-వెన్నముద్దలా మిసమిస లాడుతూ. చొక్కాలేదు. భుజాలపై ముడివేసిన బెల్టులకు పట్టుకొని వేలాడుతోంది లాగు.

పోస్టాఫీసు తెరచే ఉంది—గుండీలు రాలిపోయి.

ఇంటి చూరులా కళ్ల మీదకు వాలిపోయింది పాపటి. నొసటిపై పడుతున్న వెంట్రుకలను పైకి తోసుకుంటూ కుతూహలంగా ట్రాన్సిస్టర్‌ను పరికిస్తున్నాడు. కాంతివంతమైన ఆ కళ్లలో పరిశీలన, కుతూహలం, బుద్ధికుశలత స్పష్టంగా కనిపిస్తున్నాయి.

"నీ పేరిమిట్రా?.." వాడి దృష్టి నా వైపుకు తిప్పుకుంటూ అడిగాను.

సిగ్గు వెల్లువ ముంచెత్తింది వాణ్ని—పెదవులు కుంచించుకొని బుంగమూతి పెట్టాడు — నాకేసి దొంగచూపులు విసురుతూ, కళ్లు అదోలా తిప్పుకొంటూ మరో పిల్లవాని వెనుక ముఖం చాటుచేసికొన్నాడు.

"బుజ్జిగాడు..." సమాధానమిచ్చాడు ఆ రెండో పిల్లవాడు. ఇద్దరి ముఖాల్లోనూ పోలికలున్నాయి. చాయలో మాత్రం తేడా ఉంది.

"నీ తమ్ముడా?..." నేనడిగాను.

'ఔన'న్నట్లు తల ఆడించాడు. వాడి కళ్లు గర్వంతో మెరిశాయి. నా దృష్టిని ఆకర్షించగల్గిన ఆ ముగ్ధమోహనుడు 'బుజ్జి' తన తమ్ముడనిపించుకోవటంలో అనిర్వచనీయమైన ఆనందం, గొప్పతనం కళ్లతో ప్రతిఫలించింది.

"సరే...నేను స్నానం చేసివస్తాను. దీన్ని ముట్టుకోకుండా పాటలు వింటూండండీ..." ట్రాన్సిస్టర్ 'ట్యూన్' చేసి వడ్లబస్తాలు మెట్టుపై జెట్టాను.

పిల్లలందరూ కళ్ళు ఇంతింతలు చేసికొని దానిని గుచ్చిగుచ్చి చూడసాగారు — చెవులు దోరగా పెట్టుకొని.

నేను స్నానం ముగించుకొని పంచపాళీలోకి వచ్చాను.

లతామంగేష్కర్ నన్ను రోదన—విషాదమైన బరువైన సంగీతం—ఆ విషాద సంగీతంతో మేళవించి కుళ్లికుళ్లి ఏడుస్తున్న 'బుజ్జి'—నన్ను చూడటంతోనే దుఃఖం కట్టలుతెంచుకొని ప్రవహించసాగింది. రెండు ముంజేతులతో కళ్లు రుద్దుకొంటూ మరింతగా ఏడ్వసాగాడు.

"ఏమిటె బుజ్జీ.. ఎందుకు ఏడుపు---?"

సమాధానం లేదు. ఒక చేతితో కళ్లు రుద్దుకొంటూ, రెండవ చేతితో చూపుడువేలు తన సోదరుని కేసి చూపాడు.

"అవునండీ...ప్రకాష్ 'బుజ్జి'ని కొట్టాడండీ!" ఒక్కుమ్మడిగా అరిచాయి పది—పన్నెండు గొంతులు.

"అంటుకోవద్దని చెబితే...మరండీ...మరండీ... బుజ్జి దీన్ని అంటుకున్నాడండీ.." ఏరియల్ సున్నితంగా ముట్టుకొంటూ 'బుజ్జి'పై నేరారోపణ చేశాడు సంజాయిషీ చెబుతున్న ధోరణిలో ప్రకాష్.

"ఓస్.. ఇంతేనా?...తమ్ముడ్నలా కొట్టవచ్చా... తప్పుకదూ? దీన్ని అంటుకుంటే నాతో చెప్పాలి..రా.. బుజ్జీ...రా"...దీన్ని నీవు పట్టుకో" అంటూ రెక్క పట్టుకులాగి ట్రాన్సిస్టర్ వాడి చేతుల్లో పెట్టాను.

వాడి కళ్లు తళతళ మెరిశాయి. ఏడుపు—'స్విచ్' వేస్తే ఆరిపొయ్యే దీపంలా టక్కున మాయమైంది. ఆ విచిత్రమైన పాటల పెట్టెను స్వయంగా చేతులతో పట్టుకొనే భాగ్యం లభించినందుకు ఉబ్బితబ్బిబ్బయిపోయి 'ఫక్కు'న నవ్వాడు.

మెల్లగా చీకట్లు ముసురుకోసాగాయి.

బజార్లు నిర్మానుష్యంగా తయారు కాసాగాయి. తల్లిదండ్రులు ఎవరి పిల్లలను వాళ్లు పేరు పేరునా పిలవసాగారు వీధుల్లో నుండి. ట్రాన్సిస్టర్ నిర్విరామంగా సంగీతం వినిపిస్తోంది.

ప్రయాణపు బడలికతో నాకు కనురెప్పలు వాలిపోతున్నాయి. వంటగదిలో నుండి మా అమ్మమ్మ నాకోసం తయారుచేస్తున్న పిండివంటల ఘుమఘుమలు—వీధుల్లో తల్లిదండ్రుల కేకలు—ప్రేక్షకులు ఒక్కొక్కరే జారుకోసాగారు.

"పోదాం...రా—రా!" ప్రకాష్ తమ్ముడ్ని రెక్క పట్టుకు లాగసాగాడు.

"ఉహూ...నేను...రాను...నువ్వు...పో..." మరింత కుంచించుకుపోతూ ట్రాన్సిస్టర్‌ను పొట్టకి అదుముకుంటూ బుజ్జి సమాధానమిచ్చాడు.

వాళ్ల అమ్మ కేక మళ్లీ వినిపించింది.

తమ్ముడిపై వంకతో ప్రకాష్ కూడా కదలటం లేదు. ఆ పసి హృదయాలు ఆ వింత వస్తువును ఎంత బలంగా కోరుకుంటున్నాయో చూసి నాలో నేను నవ్వుకొని ట్రాన్సిస్టర్ 'ఆఫ్' చేశాను.

'టక్కు'న ఆగిపోయిన దాన్ని విస్మయంగా చూసి 'నీవే ఏదో చేశావ్' అన్నట్లు చూపులు నావైపు ప్రసరింపజేశాడు బుజ్జి.

"ఇక పాడదు బుజ్జీ, దీనికి నిద్దరొస్తోంది. ఇక రేపు పాడుతుంది. రేపు పొద్దున్నేరా" అంటూ ఆ వేళకు కార్యక్రమం ముగించాను.

వెనక్కి తిరిగి తిరిగి దానికేసి చూస్తూ మెల్లగా కాళ్లీడ్చుకుంటూ చీకటిలో మెట్లు దిగాడు బుజ్జి.

* * *

ఆ రెండవరోజు ఉదయానికి నాకు ముక్కులు బిగపట్టి వేశాయి. ఊరి నీళ్ల ప్రభావమో, చెరువు నీళ్ల మహాత్మ్యమో, శారీరక అస్వస్థత వలననో కానీ జలుబుచేసింది. ముక్కు చీదుకుంటూ లేచి ప్రక్కపై కూర్చుని తల పైకెత్తి చూశాను.

ఎదురుగా బుజ్జి.

నీటుగా, గోటుగా తయారై చుక్కబొట్టు దిద్దుకొన్న సూరిగాడు. తలకు ఎక్కువగా పట్టించిన కొబ్బరినూనె నొసటిపై జారుతోంది. దేవుని విగ్రహం ఎదుట భక్తిపారవశ్యంతో కూర్చొని, తదేక దృష్టితో చూసే భక్తాగ్రేసరుడులా ఎత్తుగా కిటికీలో ఉన్న ట్రాన్సిస్టర్ కేసి చూస్తున్నాడు.

ముద్దుగా, బాసిపీట వేసి కూర్చున్నాడు, 'రామా ది గుడ్‌బాయ్'లా. నేను పడక దిగడంతో వాడి ముఖం విప్పారింది.

"వాట్! బుజ్జీ—ట్రాన్సిస్టర్ పెట్టనా?" అంటూనే దాన్ని అందుకుని 'బాండ్' మార్చసాగాను.

ఇంతలోనే 'బుజ్జి' నా అనుమతి లేకుండా 'ఏరియల్' పైకి లాగాడు ఏ సంకోచం లేకుండ. కనుబొమలు పైకెత్తి విస్మరణమైన చూపులు ప్రసరింప చేశాను. దానికి సమాధానంగా వాడు కిసుక్కున కొంటెనవ్వు నవ్వాడు. తెల్లని పాలపళ్లు తళుక్కున మెరిశాయి. కళ్లలో విస్సనే విచ్చిన చనువు ప్రతిఫలింప చేశాడు.

"వెధవా! కమాన్.. జాగ్రత్తగా పట్టుకో.." వాడి చేతుల్లో పెట్టాను. 'సిలోన్' లో ఒకే సిని మాకు సంబంధించిన సంగీతం మొదలైంది. నేను టవలు భుజాన వేసికొని బావి వైపు నడిచాను. స్నానం వలన ముక్కులు మరింతగా బిగుసుకుపోయ్యాయి. ప్రథమచికిత్సగా మా అమ్మమ్మ వేడిపాలపై ఆవిరి పట్టించింది. ముసుగు వేసికొని పాలపిడత పైకి వంగి ఆవిరిపట్టే కార్యక్రమం ఐదు నిముషాలు పట్టింది.

ప్రాణం ఉక్కిరి బిక్కిరయిపోయి, గమ్మున కళ్లు మూసికొని మేను వాల్చాను. రేడియో వింటూనే బుజ్జి నన్ను ప్రశ్నలతో వెంటాడుతున్నాడు. అన్నింటికీ ఊఁ కొడుతూ, తుమ్ముతూ, చీదుకొంటూ ప్రక్కపై బడి దొర్లసాగాను. అంతలోనే మా అమ్మమ్మ అందు కొంది. 'ఒరేయ్ బుజ్జిగా.. నీవు—నీవేమిట్రా? బాబాయ్ అను—నాలుక కోసేస్తా" అని వాడ్ని గదమా యించింది. ఆమె సలహాను వెంటనే అమలు పరిచాడు. ముద్దుగా నన్ను 'బాబాయ్' అని పిలిచి నాకు మరింత చేరువయ్యాడు.

అడపా దడపా వాడి ప్రశ్నలకు సమాధానం చెబుతూ రేడియో వినసాగాను. "ఇంతటితో ఉదయ కార్యక్రమం సమాప్తి—" రేడియో చెప్పింది.

"అయిపోయింది బుజ్జీ! ఏదీ—నాకిచ్చెయ్. మళ్లీ మధ్యాహ్నం పాడుతుంది. నీవు భోంచేసి తిరిగి రా... సరేనా!" అంటూ బుజ్జగిస్తూన్న ధోరణిలో మెల్లగా వాడి చేతివేళ్ల మధ్య నుండి దాన్ని విడిపించాను.

"నేను బువ్వ తినేసచ్చా..." ఇంటికి వెళ్లాల్సిన అగత్యం లేదన్నట్లు చూస్తూ పలికాడు.

తల గీరుకొని చెప్పాను. "తింటే మళ్లీ తినిరా.. అయినా ఇది ఇంతలో పాడదు. మళ్లీ పాడాలంటే పదకొండు కావాలి..."

నా మాటల్లో వాడికి నమ్మకం చిక్కలేదు గభాలున ముందుకువంగి 'ఏరియల్'లోనికి లోశాడు.— అదుర్దాగా. ఆ చర్య నాలో కోపం కలిగిస్తుందని గ్రహించి దూరంగా జరిగి పెద్దగా నవ్వసాగాడు. నిర్భయమైన ఆ నవ్వులో తనకు నా వద్ద లభించిన స్వేచ్ఛ ఆత్మీయత స్పష్టంగా గోచరించాయి. ఆ చిన్న యంత్రం యొక్క కిటుకు ఆ'ఏరియల్'లోనే ఉన్న దని వాడు గ్రహించినట్లు కళ్లు గర్వంతో తళుక్కు మన్నాయి.

"ఆరీ.. వెధవాయి.. దగ్గరకురా.. చెబుతా.." నా కంఠంలో తెచ్చిపెట్టుకున్న కోపం.

"పిల్లలతో ఏం ఆటల్రా.. చిన్నాడా.. పడుకో.. ఒళ్లు నలిగితేనే ఇలా జలుబులూ జ్వరాలూ....నిద్రపో. అన్నీ పోతాయి. బుజ్జీ! ఇక ఇంటికిపో. బాబాయి నిద్ర పోతాడు.." మా అమ్మమ్మ లోపలి నుండి వస్తూ నాకూ వాడికీ పనులు పురమాయించింది.

ఆమెను చూస్తూనే నవ్వు టక్కున ఆపివేసి భయం భయంగా ఆమెకేసి చూస్తూ నిష్క్రమించాడు బుజ్జి.

"నీవలా పిల్లలను జేరబట్టకురా.. మనం ఇంట్లో లేనప్పుడు ఇక్కడికొచ్చి నానా ఆగడం, చేస్తారు.. మొన్నమొట్టకు మొన్న నేను చేనికిపోయి వచ్చేసరికి వీధి అరుగు నిండా మట్టి ఉమ్మెత్తఆకులూ" అంటూ లెక్చరివటం మొదలుపెట్టింది.

"అబ్బ తలనొప్పిగా ఉందమ్మమ్మా"—అన్నాను ఆమె ధోరణి మార్చటానికి ప్రయత్నిస్తూ.

"ఇదేమిట్రా—వచ్చి ఒక్కరోజైనా కాలేదు. తలనొప్పి ఒళ్లునొప్పి...పాడుముండలు—దిష్టిపెట్టి ఉంటారు. దిష్టి తీసేస్తానుండు"—లోనికివెళ్ల బోయింది.

"వద్దులేమ్మా.. అన్నీ చాదస్తపు పనులు.." నిరసన తెలిపాను.

"అయితే ఉండు.. శొంఠిగంధం తీయించిపట్టు వేయిస్తా.. చెయ్యిపెట్టి తుడిచినట్టుపోతుంది."

అమ్మ బాబోయ్.

డేంజర్—డేంజర్ — పొరపాటున నోరుజారి ఆమెకు అలా చెప్పినందుకు నన్ను నేనే నిందించు కున్నాను. ఆమె నా ఆరోగ్యాన్ని గూర్చి ఎంత హైరానా పడుతుందో సువిదితం. లోగడ నా చిన్నతనంలో

ఆమె వేసిన శొంఠిగంధపు పట్లు—ఆమె బలవంతంగా తాగించిన కషాయాలు అన్నీ కళ్లముందు పరిభ్రమించాయి. ఆమె అన్నమాట అక్షరాలా చేసి తీరుతుంది. ఆ విపత్తు నుండి తప్పించుకోవటం ఎలానా అని ఓక్షణం ఆలోచించి—

“అంతగా లేదులే.. కొద్దిగా” అన్నాను.

“అందుకే చెబుతున్నానురా.. పట్టు వేయించుకో.. మళ్లీ పెద్దది కాకుండా. నా మాట విను. మా తండ్రివి కదూ..” ఆమె బ్రతిమాల సాగింది.

“వద్దులే.. ఎక్కువయితే అప్పుడు చూసుకోవచ్చు...”

“సరే పోనీ...పట్టు వేయించుకొనకపోతే మానే.. డాక్టరుగారి వద్దకైనా పోయిరా..లే..మళ్లీ ఎండెక్కుతుంది” అంది.

బోల్డు ఆశ్చర్యం కలిగింది. ఆ వూరు స్వతంత్ర గ్రామం కూడాకాదు. రైల్వేస్టేషనున్న గ్రామానికది శివారు. అందులో డాక్టర్‌గారు వెలిశారంటే ఉత్తర వియత్నాం నుండి అమెరికా సైన్యాలు ఉపసంహరించుకున్నంత ఆశ్చర్యం కలిగింది.ఏది ఎలాఉన్నా మాఅమ్మమ్మ శొంఠి పట్టు బారినుండి తప్పించుకోవాలంటే ప్రస్తుతం ఆ డాక్టర్‌గారి అన్వేషణలో ఇంటి నుండి నిష్క్రమణ ఎంతో అవసరం.

త్వరత్వరగా బట్టలు మార్చుకొని బయటికి అడుగుపెట్టాను.

ఆమె కేకలు వినిపించాయి వెనుక నుండి.

“డాక్టర్ గారితో సిగ్గుపడకుండ చెప్పు—నేను పేరమ్మగారి మనవణ్నని. బాగా చూస్తాడు. మొన్ననే ఇరవై మానికలు వడ్లు కొలిపించుకువెళ్లాడు—మామూలని... ఆ.. ఇల్లు తెలుసుగా...ఆ పడమటి వీధి, సందులో ఆ జమ్మిచెట్టుకు పక్కగా మళ్లితే..ఆ మూల మీదే... ఎవర్నడిగినా చెబుతారు.”

“సరే సరే” అంటూ లాల్చీ బొత్తాములు సర్దుకొంటూ వీధిలో పడ్డాను.

కాళ్లు అరిగేలా ఆమె చెప్పిన జమ్మిచెట్టు వీధి, దానికి అనుబంధమైన సందులూ గొందులూ ఒకటికి నాల్గుసార్లు పైకి కిందకూ తిరిగాను. డక్టర్‌గారి పేరు విద్యార్హతలు సూచించే సైన్ బోర్డు లేదు. కనీసం ఏ ఇంటిలో నుండైనా కాళ్లకు, చేతులకు కట్లు కట్టుకున్నవాళ్లు, మందు సీసాలు పట్టుకున్న రోగిష్టులు వెంచేస్తున్నారాఅంటే అదీ లేదు. ఎవర్నయినా అడుగుదామంటే వీధి వాకిళ్లన్నీ ఓరగా వేసిఉన్నాయి.

అటు నడిచాను—ఆ మూలన పడిపోతగాన్న పెంకుటింటి వైపు. అందులో నుండి లయబద్ధంగా పిల్లల గొంతులు వినిపిస్తున్నాయి.

నాలుగు ఒకట్ల నాలుగు—నాలుగు రెళ్లు ఎనిమిది. ఒక ఫర్లాంగు దూరానికి వినిపించేలా, బాలుర కంఠాలు పద్యం చదివినట్లు రాగయుక్తంగా పలుకుతున్నాయి ఎక్కాన్ని.

దూలాలు విరిగి, పెంకులు రాలిపోయి, గోడలు పగులుబారిన, నివాసయోగ్యం కాని ఇల్లు అది—విద్యాలయము. దాని ఉనికిని తెలుపుతూ భావిపౌరులు కంఠాలతో కసరత్తు చేస్తున్నారు—ఉదయానే రేడియోలో వినిపించే వేంకటేశ్వర సుప్రభాతంలా.

మెల్లగా అటు తిరిగాను.

పది సంవత్సరాల వయస్సు పిల్లలు దాదాపు ఇరవై మంది దుమ్ము రేగుతూన్న ఆ ఇంటి పంచపాళిలో నిలబడి ఎక్కాలు బట్టీ వేస్తున్నారు. వారికి ఎదురుగా ఉపాధ్యాయుడు గోడ కానుకొని కూర్చున్నాడు చాపపై. ముందున్న చిన్న కరణంబల్లపై రూపాయలు—చిల్లర కార్డులు, కవర్లూ ఇంకా పోస్టాఫీసుకు చెందిన సామాన్య పరికరాలు—ముక్కుపై జారిన సులోచనాల జోడు, మధ్య మధ్యలో అనాలోచితంగా, యాంత్రికంగా బెత్తం తీసికొని బల్లపై కొడుతున్నాడు.ఆ ఇల్లు పాఠశాల అని పిలవటానికి ఏకైక నిదర్శనం ఆయన చేతిలో బెత్తం.

నా రాకను ఆయన గమనించలేదు. నన్ను చూసి పిల్లలందరూ ఏదో అనూహ్యమైన సంఘటన జరిగినట్లు వారి నోళ్లు మూతబడిపోయ్యాయి—కురుస్తూన్న జడివాన ఓక్షణకాలం ఆగినట్లు విరామం.

ఆయనచేతిలో బెత్తం మళ్లీ బల్లపై రెండు దెబ్బలు కొట్టింది. మళ్లీ తారస్థాయికి వెళ్లాయి కంఠాలు.

“మాష్టరూ?...”మెల్లగా పిలిచాను ఆయన దృష్టిని నావైపుకు తిప్పుకోటానికి ప్రయత్నిస్తూ.

ఆయన అప్పటికి నా రాకను గమనించినట్లే తల పైకెత్తకుండగనే 'ఆగ' మన్నట్లు చేతితో సైగ చేసి సీరియస్‌గా చిల్లర లెక్కచూసుకో సాగాడు. వాటిని కుప్పగా పేర్చి మరొకసారి కవర్నూ కార్డులూ లెక్కించాడు.

అంతలోనే ఓరైతు 'గుప్పు' 'గుప్పు'మని చుట్ట పొగవదులుతూ "అయ్యవారూ..అయ్యవారూ..ఒకఉత్తరం వ్రాయాలి" అంటూ విసురుగ్గా లోనికి వచ్చాడు. ఆ చాప మూలన కూలబడుతూ ఐదు పైసల బిళ్ళ ఆ బల్లపై ఉంచాడు. మాష్టారు ఐదుపైసల బిళ్ళ చిల్లరపై పేర్చి ఒక కార్డుతీసి ఆ రైతు చెప్పినట్లు ఉత్తరం వ్రాయటానికి ప్రారంభించాడు.

వాలుగో ఎక్కం ముగిసింది.

ఐదొకట్ల అయిదు—

ఐదురెళ్ళ పది—

ఇంటి పైన ఉన్న నాలుగు పెంకులూ లేచి పోతున్నాయి. అంతలోనే తగ్గుస్థాయికి వచ్చాయి కంఠాలు మెల్లగా ఆగిపోయ్యాయి. ఆయన ఉత్తరం వ్రాయటం ఆపి కోపంగా వాళ్ళ వైపు చూపు విసిరాడు.

"ఏళ్ళిద్దరూ కొట్టుకొంటున్నారండీ!" ఒక సుబుద్ధి అరిచాడు.

"వెనకున్న వల్లురూ ఇటురండి..."

బెత్తం కోపంతో ఊగిపోగింది—మాష్టారి చేతిలో. జంకుతూ జంకుతూ వాళ్ల కాళ్ల ఆయన్ను సమీపించాయి.

"దగ్గరకు రండి. నేను లేచానంటే—తాట వొలిచేస్తా—చెయ్యి చాపు—అదీ—ఇటుతిప్పు.."చళ్ళు చళ్ళున బెత్తం వాళ్ళ చేతులను తాకింది. ఎర్రగా కందిపోయిన అరచేతులు ముడుచుకుపోయ్యాయి. ఇద్దరికి వడ్డన పూర్తిచేసిన బెత్తం వెళ్ళిపొమ్మని దారి చూపింది. ఆయన కనుబొమలు ఎగరవేస్తూంటే.

మిగతా ఇద్దరూ అందుబాటులోకి వచ్చారు. వణికిపోతూ.

"చాపు చెయ్యి" ఆయన కంఠం గద్దించింది.

"మేం అల్లరి చెయ్యలేదండీ. వాళ్ళిద్దరే గిచ్చుకున్నారండీ. మాకేం తెలియదండీ!" అమాయకంగా ముఖాలు పెట్టుకొని, భయం భయంగా, ఒక్కొక్క మాట జారవిడిచారు.

"అలానా.. వెధవా.. నంగనాచిలా ముఖం పెడితే సరా?.. ఇంకొసారైనా నీవు గొడవ చేస్తావా.. చెయ్యవురా..."

"నిజంగానండీ.. అమ్మ తోడండీ..మేం అసలు మాట్లాడలేదండీ.." ఆ చిరుకంఠం ప్రాధేయపడుతోంది.

"అదిసరేరా!... ఇప్పుడు కాదురా.. ఇంకొసారి కైనా నీవు గొడవ చేస్తావా... చెయ్యవా?.. అప్పుడు మళ్లీ నిన్ను పిలిచి కొట్టటానికి నా కిదే పనసుకొంటున్నావా.. నాకు వేరే పనులులేవా?..పట్టు.."అంటూ నాలుగు అందుకున్నాడు. ముందు వెళ్ళిపోయిన జట్టు కంటె సగం మోతాదు తగ్గించి వెళ్ల కూర్చోమని సైగ చేశాడు.

"ఒరేయ్... ఇక కూర్చోండి.. ఆ.. ఎక్కాలు ఆపి చూసివ్రాత వ్రాయండి..." బిలబిలమంటూ అందరూ కూలబడ్డారు. 'గణితబోధిని' పుస్తకాలు సంచుల్లోకి విసిరి వేయబడ్డాయి. వాచకపుస్తకాలు బయటికొచ్చాయి. చకచకా పలకలన్నీ తుడిచి పారేశారు.

"ఏ పాఠం రాయమంటారూ?.." ప్రియశిష్యుడొకడు వినయుతతో అడిగాడు.

"వాలి సుగ్రీవుల కథ—తీసి వ్రాయండి.." మళ్ళీ ఉత్తరం వ్రాయటంలో నిమగ్నుడైపోతూ, తలవంచుకొనే సమాధానమిచ్చాడు. గొలుసుకట్టులో ఉత్తరం నాల్గుముక్కలు గీచాడు. ఆ వ్రాసిన విషయమేదో మరొక్కసారి ఆ రైతు చెవిని వేశాడు. సంతృప్తిగా ముఖం పెట్టుకొని రైతు నమస్కరించి సెలవు తీసికొన్నాడు.

మాష్టారి చేతులు వ్రాసీ వ్రాసీ నొప్పులు పుట్టాయి. వేళ్ళు విరుచుకున్నాడు. పెద్దగా ఆవులిస్తూ చిటిక వేసికొంటూ నాకేసి చూపు విసిరాడు కళ్లద్దాలలోనుండి.

"ఆ... మీ విషయం మరిచేపొయ్యాను.. ఏం కావాలి?"

"ఇక్కడ—డాక్టర్ గారిల్లు ఎక్కడో కనుక్కుందామని వచ్చాను. అంతే..."

ఆయన ముఖంలో కొత్త హుందాతనం ప్రస్ఫుటించింది. బాసిపీట వేసికొన్న అరికాలు రుద్దుకొంటూ, నిటారుగా కూర్చుంటూ గర్వంగా పోజు పెట్టాడు...

ఓహ్.. 'పోస్టుమాస్టర్' కమ్ 'టీచర్'—కమ్'డాక్టర్'—త్రివిధములైన చర్యలను ఒకేకాలంలో నిర్వహింపగలిగిన ప్రజ్ఞాశాలి. విస్ఫారిత నేత్రాలతో ఆయన కేసి ఓ క్షణం కాలం చూసి సంబాళించుకొని,

"మీరేనా.. క్షమించాలి.. నాకు బాగా జలుబు చేసింది—తల భారంగా ఉంద"న్నాను. ఆయన విచిత్రంగా నాకేసి చూశాడు. నాలాంటి అధునాతన నాగరికుడు తనను వైద్యం కోసం ఆశ్రయించటం నమ్మలేనట్లుగా కళ్ళు పెట్టుకొని.—

"తమరు ఎవరబ్బాయి?" అని అడిగాడు.

"నేను పేరమ్మగారి మనుమణ్ని.. శెలవలు గడిపి పోదామని వచ్చాను."

దిగ్గున లేచి నిలబడ్డాడు.

"నమస్కారం... నమస్కారం.. చెప్పరేంమరి.. నేను తమరెవరో సారుగారి వారనుకొంటున్నాను.." వినయంగా చేతులు జోడించి ఎనలేని భక్తిశ్రద్ధలు చూపించాడు.

నేను ప్రతినమస్కారం చేశాను.

"రండి... రండి" అంటూ ఆయన కూర్చున్న చాప మూలకేసి చూపుతూ "ఏదోనండి..తంకార్డులూ, కవర్లూ అమ్మినందుకు—టపాలు పంపినందుకు పదిహేను రూపాయలిస్తారు.చన్నీళ్లకు వేడినీళ్ళ తోడు.. ఏది మీ చెయ్యి ఇటివ్వండి.." అని ఒక చేత్తో నా మణికట్టు పట్టుకొని మరో చేతిలో బెత్తం తీసికొని నాల్గుదెబ్బలు యథాలాపంగా ఆ బల్లపై కొట్టాడు. మౌనవ్రతం పట్టి చూసివ్రాత వ్రాస్తూన్న పిల్లల కళ్ళు మధ్య మధ్య ఆయన కేసి దొంగచూపులు చూస్తున్నాయి.

"ఒరేయ్. నీడ ఎక్కడదాకా వచ్చిందో చూడు."

ఆయన ఉద్దేశించిన బాలుడు తుపాకి గుండులా బయటికి దూసుకెళ్ళాడు. బయట ఎండ పెళపెళమని కాస్తోంది. ఇంటి నీడ ఎండవైపు నేలపై ప్రాకుతోంది. ప్రాకుతున్న నీడకు ముందు నేలపై మూడుగీతలు గీచి ఉన్నాయి. ఆ గీతలు ప్రాకుతున్న ఆ నీడ ఆ పాఠశాల వేళానియమాలను నిర్ణయించే గడియారపు ముళ్ళు.

ఆ పిల్లవాడు నిరాశగా, భుజాలు వాల్చుకొని మెల్లగా లోనికొచ్చాడు. "ఇంకా 'టైం' కాలేదండీ.. ఇంకా నీడ బారెడు దూరముంది" అంటూ మెల్లగా తన స్థలం కేసి నడిచాడు.

నా చేతి మణికట్టును మాష్టారి చేతి కప్పగించి అలా కళ్ళప్పగించి ఆయనకేసి చూడసాగాను. నాల్గయిదు నిముషాల వరకూ కేస్ 'డయాగ్నిస్' చేసిన తరువాత చేతికి విముక్తి లభించింది.

"జ్వరమేమీ లేదు. కేవలం జలుబు వలన తల భారంగా ఉంది. అంతే. దగ్గు రావటంలేదు కదా?"

'ఔన'న్నట్లు తల ఊపాను.

'ఈలాటి వాటికి ఇంగ్లీషు మందులేవీ పని చెయ్యవు.. 'ఒక్కసారి శొంఠిపట్టు వేస్తే మళ్లీ తిరిగి చూడదు.."

అమ్మ బాబోయ్. ఉలిక్కిపడి లేచి నిలబడ్డాను. వెళ్లిపోటానికి ఉద్యమిస్తూ...

"లేవారేం...కూర్చోండి.. పట్టు వేస్తాను", అంటూ, నా అభిప్రాయంకోసం ఎదురు చూడకుండా గభాలున లేచి మూలనున్న బీరువా తీశాడు.

జాజి చెక్కలతో చేసిన చిన్న బీరువా—దాని నిండా ఏవో మూలికలు వేరులు-ఏవో-చిన్నచిన్న మందు సీసాలు—తలుపు తియ్యగానే ఘాటుగా వాసన ముక్కులను తాకింది. అందులో నుండి ఓ శొంఠికొమ్ము తీసి ఇద్దరు శిష్యులను పిలిచాడు. ఆ అగంతుకులిద్దరూ రివ్వున సన్నికల్లుపై వాలి, ఒకరు నీటిధార విడుస్తుంటే మరొకడు అరగదీస్తూ-గంధం రంగరించ సాగారు.

ఆ పట్టు ఇంటి వద్ద వేయించుకొంటానని చెప్పటానికి ప్రయత్నిస్తూ చెప్పలేక ముఖమాట పడుతూ నిలబడిపోయ్యాను కొద్దిక్షణాలు.

అంతలోనే వీథిలో పిల్లవాని ఏడుపు వినిపించింది. అందరి దృష్టి అటుతిరిగింది.

ఓ పెద్దమనిషి తన పుత్రుడ్ని చెయ్యి పట్టుకొని బరబరా ఈడ్చుకొచ్చాడు—చెమట్లు కక్కుకొంటూ. ఈడ్చుకు రాబడిన వాడు ప్రకాష్. ఏడుస్తూన్న స్వరం తగ్గించి కళ్ళు రుద్దుకొంటూ నిలబడ్డాడు. చంకలో మురికిసంచి వేలాడుతోంది. వాళ్లి

ద్దరికీ ఎడంగా నిలబడి వీధి వాకిట్లో నుండి భయం భయంగా చూస్తున్నాయి రెండు చిన్నకళ్ళు. ఆ ఇంటిలోకి అడుగు పెట్టే సాహసం లేక వాకిట్లో నిలబడి చూస్తున్నాడు బుజ్జి.

"ఇదుగో అయ్యగారూ..ఈడు బడికొచ్చాడా, లేదా? అన్న ధ్యాసేలేదు తమకు.. బడికి రాకపోతే మానే.. ఇంట్లోనైనా కుదురుగా కూకోవాలా?.. అదీలేదు..ఆ నరసింహరావుగారి మనువడూ, వీడూ కలిసి కోతికొమ్మంచి ఆడుకోబొయ్యారంట. ఆటలో ఏ చెట్టుకొమ్మ పట్టిందో వాడి చొక్కా కాస్తా చిని గింది. వాడు నంగనాచిలా ఇంటికి పోయి మా వాడి మీద చెప్పాడంట. ఇకచూడు—ఇంట్లో పిల్లా బీరకాయ అందరూ 'కంయ్'మంటూ మా ఇంటి మీద కొచ్చారు. వీడ్నడిగితే నేను చించలేదంటాడు. ఆ...బడీ లేదూ.. బండలూ లేవు.. ముప్పొద్దూ తినటం ఇలా గాలిగంగలా తిరగటం—ఇంటి మీదకు తగాదాలు తేవటం" అంటూ మళ్ళీ రెండు అంటించాడా పెద్దమనిషి కోపం పట్టలేక.

"మీరు వదిలిపెట్టండి.. ఏంరా..ఇటురా.."

శరీరం కంపించిపోతూండగా, అడుగు ముందుకు వెయ్యలేక, నిస్సహాయుడై మాష్టారి కేసి చూడ సాగాడు.

"రా..ఇటు.." వాళ్ళ నాన్న ముందుకునెట్టాడు.

"ఈవాళ బడికెందుకు రాలేదు? రాకపోగా నీవు చేసే ఘనకార్యాలివా?..ఆ..చెప్పు.. ఎప్పుడైనా బడి ఎగ్గొడతావా? ఎగ్గొడతావా?" అంటూ ఛళ్ళు ఛళ్ళున బెత్తం ఝుళిపించాడు.

"ఎగ్గొట్టను.. ఎగ్గొట్టను..." అంటూ దెబ్బలు తగిలిన స్థలాలపై వీపుపై చేతులతో ప్రథమచికిత్స చేసికొంటూ ప్రకాష్ చిందులు తొక్కసాగాడు ఏడుస్తూ.

"వెధవ! తోటిపిల్లలు చూడు. ఎంత ముద్దుగా వ్రాసుకొంటున్నారో! వ్రాయి—చూసి వ్రాత వ్రాయి.." వీపుపై మళ్ళీ ఓ చురక వేశాడు కొసరు.

"రాత్తా..రాత్తా.." ఒక చేత్తో వీపు రుద్దు కొంటూ, మరో చేత్తో పలక రద్దుకోసాగాడు.

ముందుకు వంగి దేహశుద్ధి చేసిన ఉపాధ్యాయుడు అలసిపోయి నిటారుగా లేచి నిలబడ్డాడు.

"పంతులుగారూ. నేనిప్పుడే చెబుతున్నా..అమ్మా—బాబూ అంటే ఈడు మాట ఇనే రకంకాదు. తన్నటమే మందు. పళ్ళొదిలి పెట్టామో నెత్తికెక్కి కూచుం టాడు.".. మరినే పోతున్నా పంతులుగారూ?.."అంటూ ఒకడుగు వాకిలి వైపు వేసి మళ్ళీ అన్నాడు. "వాడ్ని మద్దెనేల తిండికి కూడ వదిలి పెట్టవద్దు...కావా లంటే జీతగాడి చేత ఈడకే పంపిత్తా" అంటూ అన్వే షిస్తున్న చూపులతో పిల్లల మధ్య చుట్టూరా చూశాడు.

"మా బుజ్జిగాడేడి..ఇప్పు డిక్కడ్నే నిలబడ్డా డుగా?" సందేహంగా ప్రశ్నించాడు. అందరూ చుట్టూరా కలయజూశారు. నేను వాకిట్లో నుండి వీధిలోకి తేరిపార చూశాను. సదరు అభ్యర్థి జమ్మిచెట్టు నుండి భయం భయంగా పరికిస్తున్నాడు. సోదరుడు సత్కా రింపబడటం చూసి పిల్లిలా మెల్లగా మునిగాళ్ల మీద జారుకున్నాడు— ఎవరికి తెలియకుండ.

"ఆపేశారేం.. త్వరగా కానివ్వండి.." రంగ రించటం ఆపి కళ్లప్పగించి చూస్తున్న శిష్యులను హెచ్చరించాడు మాష్టారు.

"ఏం అబ్బాయ్ వత్తావా?... ఉంటావా?" అంటూ లాంఛనంగా నన్ను అడుగుతూనే "బుజ్జీ.. ఒరేయ్ బుజ్జిగా.." అంటూ కేకవేస్తూ వాళ్ల నాన్న నిష్క్రమించాడు.

శిష్యులిద్దరూ కొంతగంధం తీసి మర్రిఆకుపై వ్రాశారు. సానటిపై మర్దించటానికి మాష్టారు సన్నాహాలు చేసికోసాగాడు. వాటిని పరికించి వీధి వాకిలి సమీపించి—

"ఆ గంధం నాచేతి కివ్వండి.. నేనింటికి వెళ్ళి పడుకొని మా అమ్మమ్మ చేత వేయించుకుంటా...లేక పోతే ఇక్కడ్నే కళ్ళు మూసికొని కూర్చోవాలి"అన్నాను-ఆకు కోసం చేయిచాస్తూ.

"చిత్తం చిత్తం అలానే.. పట్టు వేయించు కొని విశ్రాంతి తీసికోండి...బాగా ఉష్ణం ప్రకోపిస్తే నాకు కబురు చెయ్యండి...ఎందుకులెండి నేనే ఓమారు సాయంత్రం వచ్చి చూస్తాను—" నడుస్తూంటే వెనగ్గా ఆయన మాటలు వినిపించాయి.

మళ్ళీ వెనుతిరిగి చూడకుండ హుటాహుటి పెద్దపెద్ద అంగలు వేస్తూ ఇంటి వైపు నడిచాను.

సుష్టుగా భోంచేసి పెరటి వైపు పంచలో మేను వాల్చాను. పెళపెళ మంటూన్న ఎండలో తిరిగి అలసి పోయిన శరీరం వెంటనే గాఢ సుషుప్తిలో మునిగి పోయింది. తిరిగి మెళకువ వచ్చి చూసేసరికి కాళ్ల వైపు బుజ్జి కూర్చుని ఉన్నాడు.

రోజు ఉదయం నేను లేచేసరికి నవ్వుతూన్న కళ్లతో పల్కరించిన బుజ్జి ముఖమంతా జిడ్డు జిడ్డుగా ఉంది.

కళ్లలో కాంతిలేదు.

ఆ చిన్నారి హృదయంలో ఏదో వ్యథ కను పాపల్లో ప్రతిఫలిస్తోంది.

కుతూహలం లేదు.

చిలిపితనం లేదు. కనుబొమలు పైకెత్తి నాకేసి ఓక్షణం అర్థిస్తూన్న చూపులతో చూశాడు. ఆ చూపులో ట్రాన్సిస్టర్ లేదు.

“హల్లో బుజ్జీ.. ట్రాన్సిస్టర్ పెట్టనా?”

తల అడ్డంగా ఊపాడు—అలవోకగా నాకేసి చూస్తూ... ట్యూన్ చేసి చేతిలో పెట్టబోయ్యాను. ‘వద్దు వద్దు’ అంటూ దూరంగా జరిగాడు. వాడి విపరీత ధోరణి చూసి విస్మయం చెంది పరీక్షగా, చూశాను. నా చూపులు భరించలేక తల క్రిందకు దించేసుకున్నాడు.

కనురెప్పలు వాలిన వాడి కళ్లలో ఆవేదన.

నాలో వాడ్ని గూర్చిన ఆలోచన.

రేడియో పాడుకొంటోంది.

వీధి కేసి దీర్ఘమైన వాడి చూపులు—ఎవరినో నిరీక్షిస్తూ తత్తరపాటుతో ఉన్న కళ్లు—కళ్లచుట్టూ మెరుస్తూన్న కన్నీరు. మంచం దిగి అనుమానంగా చూస్తూ వాకిలి వైపు నడిచాను.

అంతే!

విసురు గాలిలా వచ్చి నా కాళ్ళను పెనవేసి కొన్నాడు. పైజమాలో ముఖం దాచుకొంటూ బిగ్గరగా ఏడుపు—బుగ్గలపై కన్నీటి బిందువులు టపటప రాలిపోసాగాయి.

“ఏమిటి?.. బుజ్జీ.. ఏమిటి ఏడుపు.. నాతో చెప్పు” బుజ్జగిస్తూన్న కొద్దీ ఏడుపు మరింత... ఎక్కువైంది. తన చిరుగడ్డాన్ని పైకెత్తి—

“ఏమిటి చెప్పు..భయపడకు. వీధిలో ఏముంది? నన్ను చూడనివ్వు” అంటూ వాడ్ని విడిపించుకో బోయ్యాను.

మరింత గట్టిగా కరచిపట్టుకొంటూ “మాఅమ్మ.. అయ్యగారిని తీసుకొత్తంది..నన్ను కూడ బల్లోకి పంపిత్తదంట.. నేవింకెప్పుడూ పగలకొత్తను” వెక్కివెక్కి ఏడ్వసాగాడు.

అంతలో పంతులుగారితో సహా వాళ్ల అమ్మ ప్రత్యక్షమైంది—వీధిలో నుండే అరచుకొంటూ.

“ఇక్కడ నక్కావా?.. వెధవా?.. నేనింకా ఊరంతా దేవులాడుతున్నా..పద ఇంటికి..చూడబ్బాయ్.. నీలాటి చదువుకున్నవాళ్లు ఎవరైనా వస్తే పనికొస్తా యని నాలుగు గాజుగళాసులు కొన్నా.. అవి కొని ఇప్పటికి నాలుగేళ్లయింది. అదే వీడు పుట్టకముందు.... ఈవాళ వాడికి అదేం బుద్ధి పుట్టిందో—పద్దురా అంటే దానితోనే మంచినీళ్లు తాగాలని మొండికేసి, దాన్ని అటుతిప్పి ఇటుతిప్పి కులికించాడు. బంగారం లాటి గళాసు—చివరకు వీడి చేతుల్లో దానికి ఆయుస్సు మూడింది... పాడుపిల్లలు... వేధించి చంపుతున్నా రంటేనమ్ము.. వీళ్ల అమ్మ కడుపు నూడ... ఎంత కోపం వచ్చినా దిగమింగుకోవాల్సిందేకానీ.. చూస్తా.. చూస్తా ఒకదెబ్బ వెయ్య బుద్ధికాదు. ఇక వాడు—పెద్దాడితోపాటు వీడ్ని కూడ బళ్లో వేద్దాం—చిక్కు దీసినట్లు హాయిగా ఉంటుందని బళ్లోకి పంపిస్తా రాంటే.. ఇదిగో.. ఇక్కడ చేరాడు...” మాట్లాడటం ఆపి ఊపిరి పీల్చుకోసాగింది.

“అహా.. అయితే వీడూ గడుగ్గాయన్నమాట. రేపట్నించి పంపండి నాదగ్గరకు...మొక్కై వంగనిదే మ్రానయి వంగుతుందా?...ఇప్పుడే వంచాలి...” కళ్లద్దాల నుండి చూపులు పొడచుకొంటూ అన్నాడు.

బుజ్జి నన్ను మరింత గట్టిగా పొదవి పట్టుకొన్నాడు.

నిప్పుకోడి ఇసుకలో తలదూర్చి ప్రాణాపాయం తప్పిందని భావించినట్లు నా కాళ్ల మధ్య తలదూర్చి ఏడుపు బిగపట్టుకొన్నాడు. నాసికారంధ్రాలు మాత్రం శ్వాస పీల్చుకొంటున్నాయి.

“అయితే...నీవే పంతులుగార్ని వెంట బెట్టుకొచ్చావా వదినా...” అన్నాను. వాడికి సంభవించిన అత్యవసర పరిస్థితిని ‘ఎనాలైజు’ చేస్తూ.

"లేదండీ...నేను తనకు తలనొప్పి ఎలా ఉందో విచారించి పోదాం...మీకు కొంత వట్టు కుదరకపోతే వేసిపోదామని వస్తూంటే—దారిలో వీరుకలిశారండీ.." సమాధానమిచ్చింది పంతులుగారి కంఠం.

బుజ్జి శరీరంలో కంపనం విద్యుత్‌లా నాలో ప్రాకింది. ఓ క్షణానికి నిభాయించుకుని ఇంటిలోకి వచ్చాను. నా అదృష్టవశాత్తు మా అమ్మమ్మ ఆ దరి దాపుల్లో లేదు. ఒకవేళ ఆమె వినటం సంభవించిందంటే 'పంతులుగారు ఇంతదూరం నీ కోసం వస్తే వేంచుంచుకోపోతే ఏంబాగుంటుందని' బలవంతం చేస్తుంది. ఆమె చెంత లేకపోవటం వలన ధైర్యంగా ఓ అబద్ధం పలికాను.

"ఇందాకా బడినుంచి రావటంతోనే వట్టు వేసికొని పడుకొని ఇప్పుడే లేచి ముఖం కడుక్కున్నాను. పూర్తిగా తగ్గిపోయిందిలెండి..." ఆయన మనస్సు నొప్పించకుండ మరి రెండు మాటలు మాట్లాడి త్వరగా అక్కడ నుండి వారు నిష్క్రమించేలా చూశాను.

ఆయన పోతూపోతూ "మరి వీడ్ని సాయంత్రం నా దగ్గరకు తీసికురండి..." అన్నాడు బుజ్జిగాడ్ని ఉద్దేశిస్తూ.

ఆమె 'బుజ్జి' ఏలాటి కొరకరాని కొయ్యనో, ఇంట్లో ఎంత ఆగడం చేస్తాడో అన్నీ 'టేప్ రికార్డర్'లా చదివి పారవేసి... "ఏది ఎలా ఉన్నా మరదీ... వీడ్ని మాత్రం బళ్ళో వెయ్యాల్సిందే. నా ప్రాణానికి యముడులా దాపురించాడు.." ఆమె ఆగిపోయింది కొరకొరా పుత్రుడి కేసి చూస్తూ.

"బాబోయ్..నేనింక పగలగొట్టను. నన్ను బళ్ళోకి పంపియొద్దని చెప్పు—నేను...నేను...అమ్మ చెప్పినట్లు మాట వింటా.."ముక్కు నా పైజామాకు బుజ్జి రుద్దుతూ మళ్ళీ బిగ్గరగా బాకా ఎత్తాడు.

"ఇంకేం వదినగారూ...వీరు చెప్పిన మాటల్లా వింటానంటున్నాడుగా... ఈసారికి వదలి పెట్టండి... మళ్ళీ ఏదైనా గొడవ చేస్తే నాతో చెప్పండి...కాళ్ళూ, చేతులూ కట్టి బళ్ళో పడవేసి వస్తా..ఏంరా..సరేనా?" గద్దించాను—చివరలో సమస్యా పరిష్కారం సూచిస్తూ.

తల పైకెత్తకుండానే 'సరే' నన్నట్లు తల ఆడించాడు—ఒడంబడికకు ఆమోదముద్ర వేసినట్లు.

ఆ తల ఆడింపుతో ఉబ్బితబ్బిబ్బయిపోయి, వాళ్ళమ్మ ప్రేమపూర్వకమైన చూపులతో తనయుడ్ని చూస్తూ చిరునవ్వుతో మా గడప దాటింది. ఆమె వెళ్ళిపోయిన అడుగుల సవ్వడి గ్రహించి తల ప్రక్కకు తిప్పుకొని చూశాడు బుజ్జి. నిశ్చింతగా నిట్టూర్పు విడిచి కళ్ళు పైకెత్తి నాకళ్ళలోకి సూటిగా చూశాడు. కృతజ్ఞతా పూర్వకమైన వాడి కళ్ళు అరిపోతూన్న కన్నీటి బిందువులతో మిల మిల లాడుతున్నాయి.

---



# కవచెఱువుల శాసనము

## శ్రీ రఙ్టీ సాంబమూర్తి శాస్త్రి

శ్రీ ఆంధ్రదేశీయ్య ఇతిహాసిక పరిశోధకమండలి వారి శ్రీ రాజ రాజ నరేంద్ర పట్టాభిషేక సంచికలో "ఏడువాడల పాలెపు శాసనము" అను పేరితో కీ. శే. శ్రీ పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే వివరణముతో గూడ నిది ప్రకటింపబడినది. శ్రీ శాస్త్రిగారు శాసన కాలమును దెలుపుటయు, నన్నయకు బూర్వము గాసట బీసటగా నున్న యాంధ్రభాష నీ శాసనము దెలుపు చున్నదనియు వ్రాసి విడచిరి. శాసనపు రేకుల స్వరూపముగాని అక్షరస్వరూపముగాని పేర్కొనలేదు. గాసట బీసటగా నున్నదని వ్రాసిరేకాని యట్టి పదములైన జూపలేదు. వారి బుద్ధిలో నీ శాసనము సప్రమాణము గాదని తేల్చిరి. కాని సావకాశముగ సవిమర్శముగా బరిశీలించిన నీ శాసనము గొంత యుపయుక్తమేయని తేలును. ఎవరైన పండితు లా పనికి బూనుకొందురేమో యని వేచియుండియు, ముడిమి ముదురు చుండుటచే నూరకుండ లేక నే నాపనికి బూనుకున్నాడను. ప్రాజ్ఞులు మన్నింతురు గాక!

శాసనము బెజవాడ తాలూకా కొండపల్లికి సమీపమున గల కౌలూరునకు సంబంధించినదే. "కవ చెఱువులు" అను పదము గ్రామ నామమై యుండును. సరోవాచికాదు. అమ్మన చెఱువు. తిమ్మన చెఱువు, కలువకొలను, గుండుకొలను, కలవచెర్ల, తిప్పసముద్రము, కృష్ణరాయ సముద్రము, పేకేరు, ఏలేరు, నేకేరు మొదలగు జలాశయ వాచకముల తోడి గ్రామ నామము లనేకముగా మన దేశమున నున్నవి కదా! ఈ చెఱువులు గూడ పైవానివలె గ్రామనామమెగాని సరోవాచికాదు. కొండలు, మెట్టలు, తిన్నెలు, తిప్పలు, గెడ్డలు, చెఱువులు, సముద్రాలు, మన గ్రామనామము లందుండుట మన ప్రత్యేకతగా నగపడుచున్నది. దాన ప్రతిగ్రహీత నడపనేఱుడు. కౌలూరి ప్రాంతమువాడే. అతడో అతని తరువాతి వారో ఏడువాడల పాలెమునకు వలస వెడలి శాసన భద్రతకై దానిని కుండలో నూక బొగ్గులతో గప్పి భూమిలో పాతియుందురు. కొంత కాలమున కాప్రదేశము దిబ్బదేఱిపోయి యుండును. దాన కాలము స్పష్టముగనే యున్నది. చాళుక్య విమలా దిత్యుని రాజ్యకాలము శాలివాహన శకము 940-క్రీ. శ. 1018 సంవత్సరము జ్యేష్ఠమాస కృష్ణపక్ష నవమీ అదిత్యవారము. ప్రభవాది సంవత్సరములలో నేదియో చెప్పబడలేదు.

### చోడపరాజు

చోడపరాజు సూర్యవంశోద్భవుడు. కరికాల చోళుడు మొదలగు వారెల్లరు సూర్యవంశోద్భవులే. చోళులు సూర్యవంశులు. చాళుక్యులు చంద్రవంశులు ఈ రెండు వంశముల వారికి ననాదిగా వివాహములు వివాదములును జరుగుట ప్రసిద్ధము. ఈ చోడపరాజు చాళుక్యవంశముతో సంబంధము గలిగి వారికి సామంత మాండలికుడై యుండి విమలాదిత్యుని యనుగ్రహమున మాలయాధిపత్యము నొందినవాడు. "మల" అనగా కొండయను నర్థము గలదు గదా? కొండల తోడను, అడవుల తోడను నిండియుండి, చోరులకును క్రూరమృగములకును అన్పదమైన అనాగర కాటవిక జాతికిని నిలయమైన దుర్గమ ప్రదేశము. దేశపాల కులకు క్రూరమృగముల నుండి ప్రజలను రక్షించుట కును, ఆటవిక సైన్యముల నదుపులో నుంచుటకును నట్టి కొండప్రాంతములందు దుర్గములు నిర్మించి మాండలిక సామంతులను దళ్వాలకులుగా నియమించుట పరిపాటి. అట్లు మాలయాపాలకుడే యీ రాజు. మల శబ్దము నుండి పుట్టినవే మాలయా, మాలియా, మాళువా శబ్దములు. ఈ ప్రాంతములకు మన్నెము మన్యము అని వ్యవహారము గలదు.

### అగ్రహారము

రాజులు వేదశాస్త్రాది పాండిత్యము గల శ్రోత్రియ బ్రాహ్మణులకు సర్వ కర పరిహారముగ

...లకు చెల్లించవలసిన పన్ను లేవియు లేకుండా) ...విక్రయ సత్తాధికారయుతముగా గొంత భూమి ...ము చేయుదురు. ఆ భూమికి సమీపమున నా బ్రాహ్మణులకు నివాసయోగ్యమగు నొక గ్రామము సకల సౌకర్యము లుండునట్లు నిర్మించి యిత్తురు. ఆ భూము లా గ్రామమునకు ననుబంధించి యుండును. ఆ గ్రామములకే అగ్రహారములని పేరు. అగ్రహార ప్రశంస ధర్మశాస్త్రము లందును బురాణములందును గలదు. మహాభారతమున వీనికి వృత్తులు అని వ్యవహారము గలదు. గుణగ విజయాదిత్యుడు మొదలగు రాజులు చేసిన నందంపూడి ఉరటూరు అగ్రహారములు రాజరాజ నరేంద్రుడు పావులూరి మల్లన కిచ్చిన నవఖండవాడ మొదలగునవి ప్రాచీనములు అనేకములు గలవు. అగ్రహారములు కేవలము బ్రాహ్మణులకేకాక బ్రాహ్మణేతరులకు గూడ నిచ్చుట గలదు. విమలాదిత్యునకు సమకాలికుడగు గంగ వంశీయుడు మూడవ వజ్రహస్త దేవుడు "కుద్దాము" అను గ్రామమును వైశ్యున కగ్రహారముగ నొసంగెను. "ఆవలింగి" గ్రామమును విశ్వకర్మ కులజుల కొసంగెను. "అరసవెల్లి" గ్రామమును కాయస్థుల కొసంగెను. ఈ మహారాజు సితని పుత్రపౌత్రులు ననేకాగ్రహారంబులు దానమిచ్చిరి. అవి యన్నియు బ్రాహ్మణాగ్రహారములే కాని యిపుడా గ్రామములను తద్దానములు దెలుపు శాసనములు మాత్రమే కలవు గాని, యాయూళ్లలో బ్రాహ్మణు డెక్కడను గానరాడు. గ్రామములు కూడ చిరకాలము క్రిందటనే జిరాయితీ గ్రామములైనవి. కావున బ్రాహ్మణుల కిచ్చినవే అగ్రహారములు కావు. ఇతరుల కిచ్చిన వైనను సర్వకర పరిహారముగా నిచ్చినచో నగ్రహారములే యగును. ఇంకను ప్రతిగ్రహీత విషయమున గూడ శాస్త్రులుగారు సంశయము వెలిపుచ్చిరి. "పడవాలు నడుపనేయుకు" అని యుండుటచే వాతడు సైన్యోద్యోగియో మరియొక యుద్యోగియోయై యుండునని నాతడనాయకుడనియు వ్రాసిరి. అసలు అతడు బ్రాహ్మణుడే కాడేమోయని వారనుమానించి యుండవచ్చును. తూర్పుచాళుక్యుల శాసనము లొకదానిలో "పిడెన బోయూయ" అను నిత్యాది బోయ శబ్దాంత నామములు వేదవేదాంగ పారగులగు ప్రతిగ్రహీతలకు గలవు. ఆ బోయ శబ్దము వలెనే నేయశబ్దము గూడ ప్రాచీన 'వింత' సంప్రదాయమునకు జెందినది. ఈ నేయ

శబ్దము నుండియే అంకమనీడు బాపినీడు మొదలగు శబ్దము లుద్భవించినవి. వర్తమాన వ్యవహారమందు గల "నాయుడు" శబ్దము సంస్కృతమగు నాయక శబ్దమునకు తద్భవమనుట కంటె నీ నేయ శబ్దము నుండియే పరిణమించినదనుట సమంజసమని నా తలంపు.

## ఆఱుగురు దాతలా?

"దానమిచ్చిన వారు ఆఱుగురు కాన్పించు చున్నారు. వారు వేంగీపుర బ్రహ్మ ఘోషణాశయులై మఠాయాధిపతులని కలదు. బ్రహ్మఘోషణ మన నేమో దురూహ్యముగ నున్నది. మఠాయమే దీని గ్రామమై యుండును. దాని యధిపతులు వేర్వేఱు వంశస్థులుగా గాన్పించుచున్నారు. వీరందఱికి నేకాధి పత్యము గలిగియుండుటయు వీరు దేశాధీశుడగు విమలా దిత్యునకు లోబడిన వారగుటయు వితర్క్యము." ఇది సావకాశముగాను సవిమర్శముగాను శాసనమును పరిశీ లింపకపోవుటచే గలిగినభ్రమకాని వేఱుకాదు. దాన మిచ్చిన వారాఱుగురు కారు. ఒక్కడే చోడయ మహా రాజు. అతనికి విశేషణములుగా "కామరాజు, శ్రీమత్ తెఱమరాజు, శ్రీమత్ యిమ్మడి బెడంగురాజు, శ్రీమత్ కలియుగ కర్ణరాజు, శ్రీమత్ మార్బల గారుడండు." అను నైదు శబ్దము లుపయోగింపబడినవి. ఈ శబ్ద ములచే చోడపరాజు కాముడు ధర్మజుడు చంద్రుడు కర్ణుడు గరుడడు అను నేవురతో సౌందర్యము, ధర్మము, కాంతి, దానము, మార్బలము అను గుణము లచే బోల్ప బడినాడు. సామాన్య ధర్మమప్రయుక్త మైన తావుల నూహ్యము. ఇట్లొక్కనిని వేఱు వేఱు గుణములచే నుల్లేఖించుట "ఉల్లేఖ"మను నలం కారము. గురుర్వచస్యర్జునోయం కీర్తౌ భీష్మశ్శరా సనే" అను కువలయానందము నందలి యుల్లేఖా లంకారోదాహరణము చిత్తగింపుడు. కాబట్టి దాత లాఱుగురు కాక యొక్కడు మాత్రమే. అతడు సూర్య వంశోద్భవుడు. వేంగీపుర బ్రహ్మఘోషణాశయుడై (వేంగీపురమందు బ్రాహ్మణ వీధిని నిర్మించి యందలి బ్రాహ్మణుల క్షేశయమై పోషించువాడు) నవాడు. విమలాదిత్యుని దేశమందలి మన్నె దుర్గముల నడుపులో నుంచెడి సామంత మాండలికుడు. రామభట్టారక వరప్రసాద లబ్ద రాజ్యాభిషేక సంపద్విరాజ త్రితాం బరపతి, గరుడధ్వజుడు, మధుపుర పరమేశ్వరుడు అయిన చోడపరాజు. మనదేశమందలి శాసనములలో నిట్లు విశేషించుట సాధారణముగా గానరాదు. కాని అతి ప్రాచీనమయిన ఖారవేలుని హాత్తిగుంఫా శాసనము నం దీరీతి కనబడుచున్నది. శాసనము 16 వ పంక్తి చివరలో శ్రీ ఖారనేలుడు క్షేమరాజు వృద్ధిరాజు భిక్షు రాజు అనేక కల్యాణముల ననుభవించిన ధర్మరాజు అని కలదు.

## భాష—లిపి

శాసన ప్రతిబింబములు ముద్రింపబడకపోవు టచే లిపి విషయమునగాని భాష విషయమునగాని యిదమిత్థమని నిర్ణయింప వీలు కలుగదు. ఇది విమలా దిత్యుని రాజ్యకాలమున బుట్టినది. కావున నించు మించుగా నా కాలముననే పుట్టిన "యుద్ధమల్లుని" బెజవాడ శిలాశాసనమును బోలి యుండునని తలంప వచ్చును. శాసనము చెక్కిన శిల్పి భాషాజ్ఞానముగాని అర్థజ్ఞానముగాని బొత్తిగా లేనివాడుగా నగపడు చున్నాడు. హ్రస్వమునకు దీర్ఘములు విశేషముగా చెక్కినాడు. రేఫ స్థలముల నెక్కింట శకటరేఫములు చెక్కినాడు. సంవత్సరము శకసంఖ్య చెక్కినాడు కాని పేరు చెక్కనేలేదు. పెక్కు స్థలములందు పూర్ణ బిందువు లుండవలసినవి లేవు. ఈ లోపములు అతని సంస్కారరాహిత్యమును దెలుపును. శాసనము ఇఱువది యారు బంతులలో లిఖింపబడినది. అందు యేడు పంక్తులు చోడపరాజు బిరుదములు. తఱువాతి 8—13 వఱకు ఆఱుపంక్తులు దానకాల స్థల ప్రతిగ్రహీతృ రక్షక నిర్దేశము. దీని భాష తెలుగే. 13—19 వఱకు సీమ నిర్ణయము. దిగ్వాచక శబ్దములు సంస్కృత భాషలో "తసిల్" ప్రత్యయాంతములుగా నున్నవి. దీనివలన ననుకరణ రహితములుగా సంస్కృత పదముల నుపయోగించుట తెల్లమగును. ఇట్లు ప్రయో గించుట మఱికొన్ని శాసనములందు నగపడును. కాని దిక్కుల నిర్దేశము వరుస వాని లేకున్నది. చెప్పిన దిక్కులే మఱల చెక్కబడినవి. వాయవ్యోత్తర దిక్కులు చెక్కలేదు. వానికి మారుగా పూర్వ దక్షిణ దిక్కులనే మఱల జెక్కినాడు. మొత్తము ఎనిమిది సరిహద్దులు చూపినాడు. గ్రామముల నామము తెనిమిది గలవు.

## అరవములోని వింత అక్కరము

తెలుగులోని జ, డ, శ, ఱ అను ఇంగ్లీషులోని "Z" అను అక్షరమును ఏకకాలమున గలిపి యుచ్చ రించిన నెట్టి ధ్వని కలుగునో అట్టి ధ్వనికల వింత

యక్కారము ప్రాచీనకాలమున తెలుగు లిపిలో కూడ నుండెడిది. కాలక్రమమున నశించినది. దాని ఆకారము ఇప్పటి శకట రేఫమునకు పై నడ్డగీటు తొలగించి కుడివైపున నిలువుగీటు కొంచె మెడమ వైపునకు "గుడి" వలె వంచి వ్రాసిన నేర్పడును. యుద్ధమల్లుని బెజవాడ శాసనములో "అడిప్పిన" అను శబ్దములో నుండుట ప్రప్రథమముగా కీ. శే. కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావు పంతులుగారు కనిపట్టి లోకమునకు ప్రకటించిరి. అపూర్వమైన దానిపైని బయలుదేరిన విమర్శనములలో నింక ననేక శాసనములందును నిది బయలు పడినది. ఈ శాసనమందును 22 వ బంతిలో "నఱిపిన" అను శబ్దమున నా యక్కారమే యుండును. ప్రతి లేఖకులు తెలియక శకట రేఫముగా వ్రాసిరి.

## కొన్నిపదములకు అర్థములు

"తెఱమరాజు"—ఈ శబ్దము ధర్మరాజు శబ్దమునకు వికృతియే కాని వికారమత్యధికముగా నొందినది. ఇది ప్రాచీన భాషలో నొక సంప్రదాయమే. యుద్ధమల్లుని శాసనములో విజయవాడకు "పెఱ్ఱవాడ" అని కలదు. మఱియొక ప్రాచీన శాసనములో దక్షారామమునకు "డాకిరేమి" అని కలదు.

"ఇమ్మడి బెడంగు రాజు"—బెడంగు శబ్దమునకు కాంతి అందము అని అర్థములు. "పెఱ్ఱవాడకు బెడంగుగాగ" అని యుద్ధమల్లుని శాసనమున గలదు. ఈ శాసనమున ఇమ్మడి బెడంగు అనగా ద్విగుణితమైన కాంతి అందము అని అర్థము.

"పాడి యుచ్చి"—పాడి శబ్దమునకు ధర్మము, న్యాయము అను అర్థము లిపుడున్నవి. కాని యిట నా యర్థములు గావు. ప్రతిపత్తి, హోదా యని చెప్పవలయును.

"సీమ మసీమం"—ప్రకృత కాలమున అవధారణార్థమందు వాడే వీడే యని ఏ కారము బహుళప్రయోగము నొందుచున్నది. అటనట "నేన, నీవ" ఇత్యాద్యకారములు నగపడును. కాని ప్రాచీనభాషలో "అ" కారమేకాని "ఏ"కార మగపడదు. అగ్రహారంబు అగ్రహారంబ కాను, సీమము+అసీమమ అను ప్రాచీన ప్రయోగములే యున్నవి. సీమము అనగా సరిహద్దు అని అర్థము.

"అఱూది వేలేండ్లు"—అఱువది యనుటకు అఱూది యని లిఖించినాడు. సంస్కృత వ్యాకరణ పద్ధతిలో వకారమునకు ఉకార మాదేశమగుట కలదు., దానికి సంప్రసారణమని సంజ్ఞ. దాని వలన నొకప్పుడు వకారము ఉకారముగా పరిణమించుట కలదని తేలును. ఈ శాసనమున అఱు + పది అఱు + వది. అఱు + ఉది= అఱూది అని ప్రయోగించినాడు. పరిణామము సహజమే కాని వ్యవహారములేదు. అఱువది యను రూపమున వెంటనే ప్రయోగించినాడు.

శ్లో. షష్టిర్వర్ష సహస్రాణి స్వర్గే మోదతి భూమిదః
ఆక్షేప్తా చానమంతాచ తాన్యేవ నరకే వసేత్॥

ఇది దాన శాసనములలోని ఫలశ్రుతి రూపమయిన వ్యాసగీత. దీనినే అనువదించియు "నడుము" దీని నెడపిరేని వేయి పెఱువులు వేయి గోవిలలు వేయి గుళ్లను ఉత్తరాయణ సంక్రాంతిని నఱిపిన వారగుదురు, అని క్రొత్త పాపములను జొప్పించినాడు.

మార్బల గరుడండు:— ప్రతివీరులకు గరుడుని వంటి వాడని యర్థము. గరుడడు ఇంద్రాది దేవతల జయించి అమృత మపహరించుట ప్రసిద్ధము. కావున శత్రుసేనలకు గరుడుని వంటి వాడని భావము. నిఘంటువులలోనూ "మార్బల" పదమగపడదు. తిక్కన యుద్యోగ పర్వమున కృష్ణరాయబార సందర్భమున మునులు దుర్యోధనునితో,

క. దౌర్బల్యము దుర్మానము
దుర్బలులకు గాక తగునె దుర్యోధన నీ
మార్బలమె పాండవేయుల
దౌర్బల్యము వాపు....

అని "మార్బల" పదము ప్రయోగించినాడు. ఇక్కడ మార్బల మనగా యుద్ధోత్సాహమను నర్థము సముచితముగా నగపడుచున్నది.

ఈ శాసనమున లేఖక దోషము లధికముగా నున్నను వానిని సవరించిన నన్నయకు పూర్వమందున్న లిపి భాషా స్వరూపములు తెలిసికొనుట కుపకరించు చున్నది. అతి ప్రాచీన శాసనములలో నిది యొకటి.

# శాసనపు మూలము

1. స్వస్తి స (కా) ల బుధ(జ) న స్తూయ మాన సూర్యవంశోద్భ

2. (వ) రామభట్టారకా వర ప్రసాద లబ రాజా(భిషే)కా సంపత్తి (రాజధ్వ)

3. జ పీతాంబరపతి గరు(డ) దన్య నధ్వజ మాధుపుర పరమేశ్వ

4. (ర వేం) గీపుర బ్రహ్మ (పో)షణా శయా శ్రీ మాత్మాశమాధిపతి

5. మాయ్న పఱా(కా) మారాజు. శ్రీ మన్మ తెఅమా రాజు శ్రీమ

6. త్ యిమ్మిడి జెడంగరాజు శ్రీమత్ (శో)డపరాజు శ్రీ

7. మాత్ కలియుగ ర్నరాజ శ్రీమాత్ మార్వల గారుడ

8. ణు స్వస్తి సకాబ్దంబు ల్దాంభనూటాన ల్వాదియగునేంటి (జే)షమా

9. నమ్మన కృష్ణపక్షం నవమీ ఆదిత్య వారం స్వస్తి శ్రీ మ

10. మత్ మహాయాధిపతియ్న చోడయ రాజులు పడవాలు

11. నడపనేయ(కు) అగ్రహారంబుల(తో)డి పాడి యిచి

12. అగ్రహా(రం)బ కాను గన చెఱువులు దయచేసి యి

13. చ్చిన సొన(న)ము. పూర్వతః పొంగట్టావి సేమ

14. మసీయం నైరుత్యతః (క)(పు) లూఱి సీమ మసీమం

15. దక్షిణతః గఱివిడి సీమ మసీమం ఆ(జ)యుతః

16. రేగుల చెఱువు సీమ మసీమం పశ్చిమతః పొతిపూండ్డి

17. సీమ మసీమం యూహాన్యతః వోకాల పూండ్డి సీమ మసీమం

18. పూర్వతః పిలమొడల్స (సీ) మమసీయం దక్షిణతః

19. డన సీమమసీమం దీని నెడపక నడిపిరేని ఆఱూదినే

20. లేండ్ల స్వర్గమ్మున నుండ గాంతురు. దీని నెడపిరేని వేయి

21. పెఱువులువేయుగో(వి) లలవేయుగుళ్లనుయు

22. త్తరయాన స((క) (వి)) నఱిపినవారు అఱువది వేలేండ్ల

23. నరకయోని నుండుదురు. దీనిగాపెడువరు

24. తా మ్మిండవ రు.

25. దండ(ణ) కేతన పోతన, కన్నమ, యిన్నల్వ రు గవ

26. చెఱువులకు అధిపతులు.

# పరిష్కృత మూలపాఠపం

1. స్వస్తి సకలబుధజనస్తూయమాన సూర్య వంశోద్భ

2. (వః) రామభట్టారక వరప్రసాద లబ్ధ రాజ్యాభిషేక సంపద్విరాజధ్వ

3. (జః) పీతాంబర పతి గరు(డ)ధ్వజః మధు పుర పరమేశ్వ

4. రః వేంగీపుర బ్రహ్మ పోషనా శయః శ్రీ మన్మలయాధిపతి

5. య్యైనవారు కామరాజు శ్రీమ

6. త్ రమరాజు ఇమ్మిడి బెడంగురాజు శ్రీమత్ చోడపరాజు శ్రీ

7. మత్ కలియుగ కర రాజు శ్రీమన్ మార్బల గఱుడ

8. (ణ్డ)స్వస్తి శకాబ్దంబులు తొమ్మనూటా నల్వదియగునేటి జ్యేష్టమా

9. సమ్మున కృష్ణపక్ష నవమీ ఆదిత్యవారం. స్వస్తి శ్రీమత్

10. మలయాధిపతియైన చోళయ రాజులు పడవాలు

11. నడప నాయకునకు అగ్రహారంబులతోడి పాడి యిచ్చి

12. అగ్రహారంబకాను గనచెఱువులు దయ చేసి యి.

13. చ్చిన శాసనము పూర్వతః పాంగట్ట్వాని సీమ

14. మసీమం నైఋత్యతః కపులూరి సీమ మసీమం

15. దక్షిణతః గణివిడి సీమమసీమం ఆగ్నేయతః

16. రేగుల చెఱువు సీమమసీమం పశ్చిమతః పోతిపూండి

17. సీమమసీమం ఈశాన్యతః పోకలపూండి సీమ మసీమం.

18. పూర్వతః సిలమొదళ్ళ సీమమసీమం

19. దక్షిణతః సాడన సీమమసీమం దీని నెడపక నడిపిరేని

20. అఱువది వేలేండ్లు స్వర్గమ్మున నుండం గాంతురు. దీని నెడిపిరేని

21. పెఱువులు వేయి గోవులు వేయి గుళ్లను వేయి యు

22. ఉత్తరాయణ సంక్రాంతి నశిపిన వారు అఱువది వేలేండ్లు

23. నరకయోని నుండుదురు. దీని గాసెడు వా

24.—రు తొమ్మండువరు

25. దండ (ణ) కేతన, పోతన, కన్నమ, యున్న ల్వరు గవ

26. చెఱువులకు అధిపతులు



# ఇంక మరి ఎవరు నిజము నెరుగువారు

## (నాసదీయ సూక్తానుకరణము)

శ్రీ తెన్నేటి విశ్వనాథము

వేద వేదాంత బోధనా వేదితవ్య
మైన సత్తన్న దప్పుడు లేనె లేదు
మరి అసత్తన్న వస్తువు మాట యేల?
పృథివిలేదు, లేదు గగన పథ విధంబు.

ఆవరణమేది? దేనికి ఆవరణము?
దాని భద్రత జూచిన ధాత ఎవడు?
గహన గంభీర యంభస్సుగ బరగినది
ఏది అవాడు? దానిని తెలిసె నెవడు?

స్వయము ఉచ్ఛ్వాస నిశ్వాస వాత జనిత
మైన కదలికతో కదులాడుచుండె
ఒక్కటై అదియుండె ఏకాకివలెను;
దాని తప్పించి అన్యంబు కానరాదు.

మృత్యువేలేదు; లే దమరత్వమపుడు;
పగలులేదు; రాత్రియులేదు; పగలు రాత్రి
యున్న సంకేతమేలేదు; అదియె సృష్టి
పూర్వ నిమిషావ్యక్త స్థిత పూర్ణ జగతి.

[ చీకటిని చీకటియె తన చీరతోడ
కప్పివైచె; "ఇది అది" అని చెప్పుటెట్లు?
దృశ్యమానమై ఘనమై అదృశ్యమైన
దంతయునపుడు సలిలత్వ తత్త్వమొందె.

మొదట కోరిక యుదయించి, ప్రథమమందు
పుట్టిన మనసునకు బీజభూతమయ్యె
సత్త్వసత్త్వాల బంధుత సహృదయులయి
కాంచిరి కవులు; క్రాంతదృగ్దనులు కవులు.

బంధుతా రశ్మి మీదకు క్రిందనుండి
అడ్డుగను విస్తరించె బీజంబు దాల్చె;
పొగడలేము దాని మహిమ పూర్ణయత్న
ఫలముగాకున్న సృష్టిని సలుపగలదె.

ఎవని కెరుక? ప్రవచనము ఎవడు చేయు?
ఎందులోనుండి జన్మము? ఎందుల కిది?
దేవతల జన్మ సహితము దీనివెనుక,
ఇంక మరి యెవరు నిజము నెరుగువారు?

దీని కాధారమున్నద? లేనెలేద?
దీనికి పరమ్మై యున్నట్టి దివ్య గగన
మందు నిల్చిన అధ్యక్షమాత్రుని కిది
తెలియునేమొ? వానికి గూడ తెలియదేమొ?



# సీతాకోక చిలుక

శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

సీత యనినంత తేనెలు చిందుమదిని—
కోక యన వన్నె వన్నెల సోకము గద—
చిలుక యన్నంత చెప్పగా వలెనె కులుకు?
మూడు తియ్యందనమ్ముల ముద్ద యుదిర!

అమృత శోభా ప్రపూర్ణ లోకముల నుండి
అరుగు దెంచు ప్రియాతిథీ, స్వాగతమ్ము!
కీట కమ్మవో? వర్ణ శృంగాటకమవో?
పక్షివో? కాంతి మయ రత్న కుక్షి వగుదో?

లేత పస, పాకు పచ్చ, నీలిమలు, ఎరుపు,
కాటుకలు, మబ్బు రంగులు,— కలిపి మెదిపి
ఎవ్వరే, కుంచె ముంచి చిత్రించినారు
రెక్క రెక్కయు కనుల మిర్మిట్లు గొలుప!

ఒక్కెడ త్రివర్ణ కేతువు, లోకట వార్చు
క్వాభ చమకిత సుర ధను రంతరములు,
సుందరీ చంచలాపాంగ శోభలోకటు
చెదరి తిరుగు సీతాకోక చిలుకలందు—

పసపుపై నీలి చుక్కల మిసిమి యొసగ
ఈ యొయారి యుట్టట్టుల నెగురుచుండ
వలపు ముచ్చట దొడుగు క్రొంబట్టురైక
బుజ మొకడు తీయగా తలంపునకు వచ్చు

నిగ నిగల మబ్బు రంగులు నీలి సుడులు
పుంచి ముత్తెంపు చారల మరకతములు
కలిపి యుద్దిన పావడా కండువాలు
వైచికొని యాడు నీ క్రొత్త బాల లెవరు?

నవవధువు మేలి ముసుగు, చిన్నారి బాల
చోళిగా, నవ్యయువతి వక్షోజ వసన
పరమ రమణీయమూర్తిగా భ్రమలు గొలిపి
మతకరీ ఎంత నటన నేర్చితివి నివు!

దండకాటవిలోన సీతమ్మ తల్లి
మాయ యెరుగని కన్నుల చాయలందు
నిలువు నిలువున వన్నెల నొలుకబోసి
పొంచి చను లేటి కూన కావుగద— నీవు?

పంచవటి రమ్య కాననో పాంత సీమ
గౌతమీ పుణ్య వారి సుస్నాత యగుచు
అమ్మ పరచిన చీర సోయగము దాల్చి
నిల్చితిరి—మీదు బ్రతుకు పండినది పొందు!

ఎన్నడో మూల కొదిగి నిద్రించు నెడద—
వీాడు చిన్నారి నాట్యాల మేలు కొనుచు
తానునున్ రంగు రెక్కల దాల్చి—నేడు,
నృత్య మొనరించునేమొ వీా స్నేహవశత!



# తిరుపతి కవుల సాహిత్య సమీక్ష

## శ్రీ నిడుదవోలు వెంకటరావు

ఇది సర్వాంధ్రదేశాన్ని జగదాశ్చర్యకరమైన శతావధాన విద్యచేత తన్మయత్వమును చెందించిన తిరుపతి వేంకటకవుల సాహిత్యసమీక్షా గ్రంథం. ఇందులో గ్రంథాంతమున విషయసూచికలో ఈ క్రింది పదిహేడు శీర్షికలున్నవి.

---

1. జీవితము
2. దేశసంచారము
3. కల్పితకావ్యములు
4. పౌరాణికకావ్యములు
5. ఆంధ్రీకృతకావ్యములు
6. వివాదకావ్యములు
7. లఘుకావ్యములు
8. అన్యాపదేశకావ్యములు
9. ఆంధ్రీకృతరూపకములు
10. పాండవ నాటకములు
11. ఇతర నాటకములు
12. భాషాసౌందర్యము
13. సారస్వత రచనలు
14. దివాకరాస్తమయము
15. తరువాతి రచనలు
16. వచనరచనలు
17. బెజవాడలో వెంకటశాస్త్రిగారు.

అయితే పై పదిహేడు శీర్షికలలోను—

ఏది చెప్పగానే చప్పున తిరుపతి వేంకటకవుల నామధేయం, ఆంధ్రుల నాలుకలపై నాట్యమాడుతుందో,

ఏది వారి లోకోత్తర ప్రతిభను ప్రవ్యక్తము చేసినదో,

ఏది నానారాజ సందర్శన మూలంగా, సకలాంధ్రదేశానికి శ్రవణానందము కావించినదో,

ఏది వారికి సాహిత్య ప్రపంచంలో స్థానము సంపాదించినదో,

అట్టి "శతావధానము" అనే శీర్షికయే లేదు. ఇదొక్కటే, ఈ గ్రంథరచనాక్రమ మెట్లు సాగినదియు స్పష్టముగా తెలుపుచున్నది. ఇంతే కాదు—అరవై యేండ్లుగా, అద్యతనాంధ్ర వాఙ్మయ ప్రపంచంతో అవినాభావ సంబంధముగల, తిరుపతి వేంకటకవుల జీవితవిశేషాలు, ప్రతిభాదికము, కవితా చమత్కారాలు, గ్రంథరచనలు— వీనివి గూర్చి "ఒక వాఙ్మయమే" కలదు. అది పరిశీలించినట్లయితే, ప్రస్తుత గ్రంథంలో, ఎన్నో తెలుపవలసిన విషయాలు లోపించినవని చెప్పకతప్పదు. వాస్తవ స్థితి యిట్లుండగా, ఈ గ్రంథానికి పరిచయము వ్రాసిన కళాప్రపూర్ణ విశ్వనాథ సత్యనారాయణగారీ సందర్భంలో ఏ రీతిగా వ్రాశారో చూడండి: "ఈ గ్రంథమున మహాకవుల యిద్దరి జీవితములు, స్నేహములు, ప్రతిభాదులు వారి వివాదములు, వారు రచించిన సర్వగ్రంథ విషయములు సర్వమును ఒక్కటియైనఁ బరిత్యజింపకుండ వ్రాయబడినవి."

ఈ క్రింది విషయములను అవగాహన చేసికొన్న యెడల పై వాక్యమునం దెంత "సత్య"మున్నదీ తెలియగలదు.

జం ట క వు లు

శతావధానమువలెనే జంటకవులన్న శీర్షిక ఈ గ్రంథంలో లేదు. ఈ జంటకవి సంప్రదాయం, ఒక్కతెలుగులోనే తప్ప సంస్కృతంలోగాని, ఇతర దేశభాషలలోగాని లేదు. తెలుగులో పదమూడవ శతాబ్దిలో కాచవిభుడు, విఠలరాజు కాలం నుండి ఈనాటి వఱకు జంటకవుల సంప్రదాయం వాఙ్మయచరిత్రలో అవిచ్ఛిన్నంగా అగపడుచున్నదే. నందిమల్లయ ఘంట సింగయ్య, తురగా రాజకవి అయ్యంకి బాలసరస్వతి, కేసన మల్లన కవులు, అయ్యలరాజు అయ్యల భాస్కర కవులు మనకు పరిచితులే. నవీన యుగంలో తిరుపతి కవులు జంటకవిత్వానికొక ప్రత్యేకత నాపాదించారు. తెలుగులో, నవ్యయుగంలో జంటకవయిత్రులు కూడా ఉన్నారు.[1] చలనచిత్రములలో[2] కూడా జంటకవి ప్రసక్తి యుండగా నీగ్రంథమున నది లేకపోవుట చిత్రముగా నున్నది.

శ తా వ ధా న ము

జంటకవి సంప్రదాయంవలె శతావధాన సంప్రదాయం తెలుగువారి ఉపజ్ఞ. భారతీయ దేశభాషలలో, ఒక్కతెలుగులో తప్ప, సంస్కృతభాషలోను శతావధాన ప్రక్రియలేదు. దానిని సంస్కృతభాషలో ప్రవర్తిల్ల జేసినవారు తెలుగువారే.[3] నాకు తెలిసినంతవఱకు కొందఱు సంస్కృతభాషా శతావధానుల నామధేయాలను పొందుపఱుస్తున్నాను.

1. వఝ్యం వాసుదేవ పరబ్రహ్మశాస్త్రి (1826—1890.) 1848 బందరు.

2. పరవస్తు రంగాచార్యులు (మహామహోపాధ్యాయ) (1822—1900) 1855. బొబ్బిలి.

3. మండయం కృష్ణయాచార్యులు (1860 ప్రాంతము) 1864. మదరాసు.

(తత్త్వబోధినీ పత్రికలో నీ అవధాన విశేషములు గలవు).[4]

4. మానవల్లి గంగాధరశాస్త్రి (1849—1913) 1879. కాశీక్షేత్రము.

5. వేమూరి శ్రీరామశాస్త్రి[5] (1870—?) 1898 బరోడా, 1903 కాశ్మీరము, 1909 పూనా.

6. పిసుపాటి చిదంబరశాస్త్రి[6] (కీర్తిశేషులు) మైసూరు, తిరువాన్కూరు.

తెలుగులో శతావధాన చరిత్ర యింతవఱకు సమగ్రంగా వెలువడనే లేదు. క్రీ. శ. 1240 లో నెల్లూరి తిక్కరాజుకాలంలో ఉన్న పెద్దయామాత్యుడి దగ్గఱ నుంచి యిది ప్రారంభమవుతుంది. మనకు పరిచితులైన చరిగొండ ధర్మన్న, రామరాజ భూషణుడూ కాక, చింతలపల్లి వీరరాఘవ కవి, రెంటూరి రంగరాజు, మరింగంటి సింగరాచార్యులు మొదలగు శతావధాన కవు లెంతోమంది యున్నారు. వారి చరిత్రలు సేకరించాలి. ఏమైనా ఆంధ్రదేశ శతావధాన చరిత్రలో, తిరుపతి వేంకటకవులు, శతావధానమును "ఆంధ్రశారదా విజయధ్వజము"గా ఆచంద్రార్కము

1. శ్రీమతి గిడుగు లక్ష్మీకాంతమ్మ, జొన్నలగడ్డ శారదాంబగార్లు-వీరిలో శ్రీమతి గిడుగు లక్ష్మీకాంతమ్మగారు ఆయుష్మతియై యున్నది. శ్రీమతి జొన్నలగడ్డ శారదాంబ (కీ. శే. జొన్నలగడ్డ సత్యనారాయణగారి ధర్మపత్ని.) భర్తకన్న ముందే కీర్తిశేషయైనది.

2. "ఇంటాబయట జంటకవుల్ వలె అంటుకు తిరగాలోయి—" (పెళ్లిచేసి చూడు.)

3. ఈ రెండింటిని గూర్చి ఆంగ్లేయ భాషలో ఉన్న భారతీయ భాషాచరిత్రలు చదివాను. కాని వానిలో నిది కానరాలేదు. పరిశోధకులైన విద్వాంసులింకను వీనిని గూర్చి పరిశ్రమ చేయుదురని భావిస్తాను.

4. చూడుడు. 'త్రిలింగ' పత్రిక — నా వ్యాసము—తత్త్వబోధిని శతావధాన విశేషములు— 10—12—1948.

5. చూడుడు. ఆధునిక కవి జీవితములు. పుట. 25—27.

6. వీరు శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారి సహపాఠులు, శిష్యులు.

నిలిపినారు. వారి మొదటి శతావధాన వివరణతో ఈ వ్యాసం ప్రారంభిస్తున్నాను.

## మొదటి శతావధానము

### కాకినాడ—1891

తెలుగు శతావధాన చరిత్రలో తిరుపతి వేంకట కవుల శతావధాన ప్రక్రియ, సువర్ణ యుగము. అందును, వారి మొదటి శతావధానము చాలా ముఖ్యమైనది. పాఠకలోకమున కింతవఱకు ఆ యవధాన విశేషము తెలుకబడలేదు కాబట్టి, వాని నీ క్రింద వివరించుచున్నాను.

ప్రథమ శతావధానము జరిగిన శుభదినము.—క్రిందటి ఖరసంవత్సర ఆశ్వియుజ బ ౮ దినము అనగా, క్రీ. శ. 1891 అక్టోబరు 25వ దిని అయ్యున్నది. ఆ అవధానమొక పుస్తక రూపముగా క్రీ. శ. 1892లో వెలువడినది. "శతావధాన శ్లోకములు" అని దాని పేరు. ఆ పుస్తకము ప్రస్తుత మలభ్యము. దాని ముఖపత్ర మిట్లున్నది:

శుభమస్తు
శ్రీమత్పర దేవతాయై నమః
శతావధాన శ్లోకములు
ఇవి
శ్రీ కింకవీంద్ర పంచానన విద్వత్కవి బిరుదాంకితులగు దివాకర్ల తిరుపతిశాస్త్రి, చళ్లపిళ్ల వెంకటశాస్త్రియు నను నీ మహాకవులచే రచియింపబడి

తత్ప్రియశిష్య విశ్వనాథ రామబ్రహ్మ సోమనాథ
శాస్త్రులను నీ మురువుర ప్రేరేపణచె
చెన్నపురి
వర్తమాన తరంగిణీ ముద్రాక్షరశాలయందు
ముద్రింపించి ప్రకటింపబడినది.
1892

పుటలు 28—చిన్నసైజు. (యథామాతృకము.)

ఈ చిన్ని గ్రంథమునకు పీఠిక రూపమున, 'ప్రకటన' అను శీర్షిక యున్నది. దానినుండి తెలియదగిన విశేషము లుండుటచేత, ఆ ప్రకటనను తూచా తప్పక యిచ్చుచున్నాను.

ప్రకటన

"అయ్యా, కాకినాడ పురంబున నుండు పిఠాపురం రాజావారి హిందూ పాఠశాలలో ఖర సం. ఆశ్వీజ బ ౮ రోజున నొక మహాసభ జరిగినది. అట్టియెడ మ.రా.రా. శ్రీ తోలేటి నృసింహంగారు, దురిసేటి శేషగిరిరావుగారు, బాదం వెంకటరత్నంగారు, బోడా రాజుగారు మొదలగు సరసులు మా గురువులగు తిరుపతి వెంకటశాస్త్రుల వారిని జూచి "యిదివరలో తమరు శతావధానము జేసెదమని బలికియున్నారు. దాని రీతి యెట్లనో వివరింపవలయున"నిన వారిలో నొకరీ శ్లోకమున నుత్తరమిచ్చిరి:

[7]శ్లో॥ తత్తన్మానవమాన సాదృతతమం వృత్తం తథా వస్తు చ
స్వీకృత్య ప్రథమం శతాయ నరయం తత్పాద మేకం వదేత్
భూయః కైర్నచబోధితః క్రమవశా త్పాద త్రయం కీర్తయే
దేవన్నామ శతావధాన మథచేత్పద్యానసంకీర్తయేత్

వారు దీనిని విని "యిట్టి దుష్కరమైన పని మీరు జేసెదమనిన నమ్మశక్యముగా"దని పల్కిరి. అట్టియెడ వారిలో నొకరీ పద్యమున వారి సందియము దీర్చిరి:

చం. నిలుచుని వేయిపద్యముల నేర్పలరంగను సంస్కృతాంధ్ర భా
షలందగఁ జెప్పనేర్తుమని చాలఁగ బ్రజ్ఞవహించి నట్టి మే
మెలమిని నూరుపద్యముల నిప్పుడు జెప్పుట కేమి చిత్రమా
విల వర బాదమన్వయ నదీశ సుధాకర వేంకటాహ్వయా

వారీ కవితా రీతిని విని వీరు బాలురైనను వీరి సరస్వతి బాలగాదని నిశ్చయించి చేయుట కంగీకరించిరి.

---

7. ఈ శ్లోకము తిరుపతి శాస్త్రిగారు చెప్పినది. తరువాతి తెలుగు పద్యము వెంకటశాస్త్రిగారు చెప్పినది.

అప్పుడు వీరిరువురు వాంధ్రంబున నేబది పద్యంబులును సంస్కృతంబున నేబది శ్లోకములను చెరి యొక చరణముగా రచియించిరి. అప్పుడు కోరిన వృత్తముల యొక్కయు, వర్ణనల యొక్కయు కష్టమును పద్యములే విశదపరచుచున్నవి. కొందరు తారుమారుగా కూర్చుండిన నది కనుగొనుటయు, తలక్రిందుగా జెప్పుటయు, మొదటి మనుష్యులు లేకపోయినను జెప్పుటయు మొదలగు విచిత్రము లీ శతావధానముననేగాని మరి యెచ్చటను జూడబోము. ఈ పద్యములు నిర్దుష్టముగ నుండుటచేతను, వ్యాకరణాది శాస్త్రముల యందు స్వతంత్రులగుట చేతను, వీర లా సభయందు విద్వత్కవులను బిరుదు నొందిరి. యీ పద్యములు సర్వజనులకు దెలియుటకొర కచ్చు వేయించినారము.

విధేయులు,

రాఘవభొట్ల విశ్వనాథశాస్త్రి,
యీవని రామబ్రహ్మశాస్త్రి,
దేవరకొండ సోమనాథశాస్త్రి."

పై యుద్ధృతాంశము మూలముగా, ఈనాటి వారికి తెలియని అపూర్వ విషయములెన్నో తెలియుచున్నవి.

1. ప్రారంభమున తిరుపతి వెంకటకవులు— సగము తెలుగు, సగము సంస్కృతముగా శతావధానము చేయుట.

2. అవి ఒక్కొక్క ల్కొక్కక్క చరణముగా రచియించుట.

3. కోరిన వృత్తములు చెప్పుట.

4. కోరిన వర్ణనలు చెప్పుట.

5. పృచ్ఛకులు తారుమారుగా కూర్చున్న కనుగొనుట.

6. మొదటి మనుష్యులు లేకపోయినను జెప్పుట.

7. స్థానిక విశేషము లెఱింగించుట.

8. విద్వత్కవి బిరుదము.

9. అవధానమధ్యమున సమస్యలు లేకుండుట.

తరువాతి శతావధానములలో తిరుపతి వేంకటకవులు తెలుగుపద్యములు విశేషముగ, సంస్కృత శ్లోకములు చాలా తక్కువగాను చెప్పెడివారు. ఈ అవధానమున శ్లోకములు పద్యములు సమానముగ నున్నవి. అవి వేఱ్వేఱుగా ముద్రింపబడినవి. సంస్కృతభాగమునకు "తిరుపతి వేంకటీయ శతావధాన శ్లోకాః" అని పేరు. ఈ భాగము వలన, తిరుపతి వేంకటకవుల సంస్కృత భాషాపాండిత్య మా కాలమునకే ఎట్టిదిగా నుండెడిదో తెలియునగును. అందుండి కొన్ని శ్లోకముల నుదాహరించుచున్నాను.

సీతాకల్యాణ వర్ణన— ఉపజాతి వృత్తం

ఏనా మనూనాకృతి భాసమానాం
మత్స్యుత్రికాం తే ప్రదదేహి జాయాం
తథాచ కించిత్తు వదామి సంజ్ఞా
శాస్త్రం త్వయ్యేష విధినేవ మాన్యా. 53.

అ:—విష్ణుః—ఇనః—భర్తా - యుష్మత్ప్ర ఏనా,
పూర్వజన్మ వివిశేషః।
తాం, ఏనాం సీతామిత్యర్థః। అన్యేష్వవతారేషు
కన్యాదానస్యాభావాత్
విధినా, విధి శాస్త్రేణ సంజ్ఞాశాస్త్ర మివ,
మాన్యా, కార్యకాలవక్త
ఇతిబోధ్యం॥ ఏతచ్చ పాణినీయశాస్త్ర ప్రసిద్ధం॥

ఏకప్రాస శ్లోకములు

ఫాలాంబుజోపమ శరీరవిరాజమానా
నీలాంబు జన్మనయనాంక విరాజ సేవ్యాం
లీలార్ధ శీతకిరణోపమ దివ్యభాలాం
బాలాం భజే సతత మాధవ పానలోలాం 55.

గంగాంతాంభజతపదాతిశీతనీరాం
భంగాళీకసదురుహంస భాసమానాం
భృంగాళీ కలిత సరోజగంధపూర్ణాం
సంగ్రచ్ఛీమునివరభాసమానతీరాం 75.

---

8. 'ఫాల' శబ్దము— భాలమనుటయేసరి— సంస్కృతకోశములలో 'భాల'శబ్దమే కలదు. హరిశ్చంద్ర నలోపాఖ్యానమున— 'యశోభాలనన్నుతిహేతి' (2—26) అనుచోట యశో, భా,లనన్నుతి — అని యొకచోటను, శోభాలనన్నుతిహేతి అని మరియొక చోటను శ్లేషలో రావలెను. 'శోభా' అనుచోట భాలకు, ఫాల యున్నచో శ్లేష చెడుటయేగాక 'శోఫా' అను దురర్థము సంభవిల్లును.

త్రిపురాంతక వర్ణన—వంశస్థ వృత్తం

జిగాయ యోవై త్రిపురం దృగగ్నినా
చకార యోవై మదనం నిరంగకం
జఘాన యోవై గజనామ దానవం
ససజ్జనారీ స్సిరతం విశిక్షతాం 88.

శతఘంటకవి హృదయ వర్ణన—స్రగ్ధరావృత్తం

శ్లో. వాలోద్భూతాంబుజాభం
శతకవి హృదయం భాతి భో పండితేంద్రా
స్తస్మాత్సుర్వాపి దోషాస్తదపిచనహి
సంసేరతాం మానసేపి
యుస్మాదాలోచ్యపద్యే కథమపి రచితే
కుండలీశేన మాసం
దృష్టాదోషాస్సహస్రం ప్రతిపద మథవా
భ్రాంతి మాన్కోనలోకే. 91.

తిరుపతి వెంకటకవుల సంస్కృతాంధ్ర రచనలలో నీ యవధానమే మొట్టమొదటి రచన. తెనుగులో పద్యరచనలకు వారి పేరుండనే యుండును. సంస్కృతమున కూడ, వారి పేరుండునట్లుగా నీ క్రింది శ్లోకములలో నిరువురి పేళ్లను నిబంధించియున్నారు:

లక్ష్మీవర్ణన—మాలినీ వృత్తం

శ్లో. జలజనయనజాయాం సర్వసంపత్ప్రదాత్రీం
నిరుపమగుణజాలాం నిత్యకల్యాణలీలాం
ధనికసదనవాసాం చంద్రమస్సోదరీ తాం
హృది భజన నితాంతం వెంకటాభిఖ్యశాస్త్రీ 58.

సరస్వతీవర్ణన—స్రగ్ధరావృత్తం

శ్లో. శ్రీశ్రీపత్యాఖ్య విద్వత్పరిబృఢహృదయాం
భోజనారాయమానాం
శ్రీరాజద్వేంకటాఖ్యోల్లస దతుల
కలావిన్మణిస్థాలమానాం
వీరేజాస్యాం శుభాంగీం
కరకలితలసత్పుస్తకాంభోజవీణాం
వాచాందేవీం నితాంతం సకల కవినుతాం
నౌమి మన్మానసాబ్జే (71)

శ్రీపత్యాఖ్య=‘తిరుపతి’ అనుదానికి సంస్కృతము.

సరస్వతీవర్ణన—మాలినీవృత్తం

శ్లో. నిరుపమగుణజాలం భావయే ధాతృజాయాం
తిరుపతిహృదయాంభోజాతనారాయమానాం
సరసవచన ధాత్రీం సర్వలోకైకనేత్రీం
విలసితతనుజాతద్వేంకటాభిఖ్యనారీం.(72)

అన్నపూర్ణాస్తవః—మందాక్రాంతావృత్తం

శ్లో. పూర్ణాంసేవే దివిజవినుతాం భాసురామన్నపూర్ణాం
చర్లబ్రహ్మోభిదబుధగృహప్రాంగణ ప్రాప్తవాసాం
తచ్ఛిష్య శ్రీపతివరసుధీసేవ్యమానాంఘ్రియుగ్మాం
తాదృక్ష్శ్రీ వేంకటబుధవిధుప్రార్థనావద్యరక్తాం
(86)

ఇందిరువురి పేళ్లేగాక వారి గురువులగు చర్ల బ్రహ్మయ ప్రశంసగలదు.

సంస్కృతమునసేకాక తెలుగు భాగములోను, ఈ స్వనామాంకిత పద్యములున్నవి.

ఆదిశక్తివర్ణన—చంపకము

నిరతము మానసంబునను
నేర్పునగొల్చెద శక్తి భక్తితో
సరసిజసంభవాది దివిజ
ప్రకరార్చితపాదపంకజన్
సరసతమిత్రచంద్రమ
ఉషర్బుధరూపవిలోచనోజ్జ్వలన్
తిరుపతివెంకటాభిధ
సుధీమణిగీతసహస్రనామకన్. (28)

సరస్వతీవర్ణన—శార్దూలము

శ్రీమాఅంగ దలంచెదన్ మనమునన్
శ్రీమత్కలాదేవతన్
సోమాబ్జారిసుధాసరిద్ధవశర
న్నూత్నాబ్జభాసంయుతన్
భూమాదిత్య మనోంబుజన్మ తరణీ
భూతప్రభావత్పదన్
శ్రీమచ్ఛ్రీపతి వేంకటేశ్వర సుధీ
శ్రీ సోద రాస్యాలయున్ (34)

తెలుగు భాగము ప్రసక్తమైనది గావున నందుండి రెండు పద్యము లుదాహరించి వాని విశిష్టతను తెలుపుచున్నాను.

శార్దూలవర్ణన—శార్దూలము
ఘోరాకారము సర్వహింసకము
సత్కుంజాంతరావాసమున్
రారాజద్ధరణీధరాకరక
వక్త్రంబున్మహోభీల గం
భీరారావ పలాయమాన మహిషీ
భీత్యుద్గతాభీల సం
చారానేక మృగాళి దిఙ్నిచయమున్
శార్దూలమున్ జూడుమీ (49)

శార్దూలవర్ణన శార్దూల వృత్తముతో చెప్పుటయేగాక, ఆ వృత్తనామమును, ఆ వృత్తములో నిమిడ్చుట ప్రాచీన [9]కవిసంప్రదాయము. దీనినే 'ముద్రాలంకార'మందురు.

ప్రథమ శతావధానమునందే యిట్టి విశేషము చూపుట విశేషమే!

ఇందు సమస్యలు రెండు అవధానానంతరమున నున్నవి. ఇవి నూరు పద్యములైన తరవాత యున్నవి. అందును నొక విశేషమున్నది. ఒక్కొక్క సమస్యను, తిరుపతి శాస్త్రిగారును, వెంకటశాస్త్రిగారును ప్రత్యేక పద్యములతోపూరించిరి. దీనిని బట్టి ఈ సమస్యలు, అవధానమున నీయబడక, అవధానానంతరము సభవారిచ్చినట్లున్నది. దీనిని గూర్చి ముందే తెలిపితిని.

ఈ సమస్యలలో నొకటి :

'బకమున్వడి మ్రింగుచున్న బల్లిం గనుమా' అనునది. దీనిని వెంకటశాస్త్రిగా రిట్లుపూరించిరి.

ప్రకటతర కప్పగంతుల
సుకులోదధిచంద్ర రామ సూరిజనేంద్రా
సుకరముగా మక్షికా శా
బకము న్వడి మ్రింగుచున్న బల్లిం గనుమా

ఇందులో విశేషమేమనగా ఈ సమస్య నిచ్చిన వారి పేరు, పద్యములో నుండుట. కప్పగంతుల రామశాస్త్రిగారీ సమస్య నిచ్చినవారు[10]. ఇట్టి సాహితీ విశేషములేగాక, కాకినాడకు సంబంధించిన నీటిపదుపాయము-మల్లేశ్వరాలయము—పాఠశాల — ఆనువ్రతి మున్నగు స్థానిక విషయము లీ యవధానమున గలవు.

తరువాతి అవధానములలో పై యవధానములోని విశేషములు కొన్ని లేక, కొన్ని క్రొత్తవి గలవు. కాబట్టి తిరుపతి వెంకటకవుల అవధానక్రమ పరిణామము దెలిసికొనుట కిది చాలాముఖ్యమైనది.

1. శతావధానమంతయు తెలుగుననే-అచ్చటచ్చట సంస్కృత వృత్తములు

2. సమస్యాపూరణము (అవధాన సమయముననే)

3. స్వనామాంకితము— పృచ్ఛకనామాంకితములు లేకుండుట.

4. కవితారచనలో తెలుగుదనము.

5. లోకజ్ఞతాపరిణతి

6. స్థలవ్యక్తిగతములగు మార్పులను విసర్జించుట—మొదలగునవి.

పై వానిలో అవధాన సమయముననే సమస్యాపూరణము అనునది మొదటి శతావధానమున లేదని తెలిపితిని. కాని తిరుపతి వెంకటకవులే వారు స్వయముగా ముద్రించిన "శతావధానసారము"లో సమస్యను అవధాన మధ్యముననే పూర్తిచేసినట్లుగా నీ క్రింది రీతిని ముద్రించినారు.

---

9. నన్నెచోడని కుమార సంభవముననేగాక భారతాదుల యందు నిది కన్పట్టును. చూడుడు—కుమారసంభవపీఠిక—వావిళ్ల ముద్రణము.

10. కప్పగంతుల రామశాస్త్రిగారు (1850—1935) తూర్పు గోదావరీ మండలమున ప్రసిద్ధ పండితులు. కీర్తిశేషులు జయంతి రామయ్యపంతులుగారికి గురువులు. క్రీ. శ. 1875—95 ప్రాంతములలో కాకినాడలో నుండెడివారు.—వీరి యాంధ్రకావ్య రచన నైపుణి యనన్యసదృశము.— (చూడుడు ఓగిరాల జగన్నాథ కవిగారి సుమనో మనోభిరంజన పీఠిక.) వీరు సంస్కృత భీమఖండమునకు సంస్కృతభాషలోనే, ఒక పీఠిక రచియించి యున్నారు. అది క్రీ. శ. 1879 లో కాకినాడ ముద్రాక్షరశాలలో తెలుగు లిపిలో ముద్రితము.

సమస్య.

"అంధుం దర్శనిశీథమందు గనె
నయ్యర్కేందు బింబమ్ములన్"[11]

శా. పుంభర్మేతసరస్వతీకవులతో
భూపాలకుం "డాదితే
యాంభస్తీక్ష్ణగభస్తిబింబముల
దీవ్యద్వ్యాప్తి వర్ణించిన
గ్రంథమ్ముల్ రచియింపుఁడీ" యనిన
దద్గ్రంథాను సంధాన నిద్రాంధుం
దర్శనిశీథమందు గనె
నయ్యర్కేందు బింబమ్ములన్."

కాని యిది ముందు నేను వివరించిన రీతిగా అవధానమధ్యమునకాదు. ఈ పూరణము తిరుపతి శాస్త్రి గారిది. దీనికే వెంకటశాస్త్రిగారి పూరణ వినండి.

శా. "సింధో'కావ్య కలామృతస్య సుకవే
శ్రీసోదరం పద్మినీ
బంధుంచాహాని పూర్ణకాంతి కలితం త్వం
వర్ణయా'యే"యటంచుం
ధార్ష్ట్యంబున బల్కె రాజొకఁడు
తత్సూత్రార్థసంధాన నిద్రాంధుఁ
దర్శనిశీథమందుగనె
నయ్యర్కేందు బింబమ్ములన్.

వెంకటశాస్త్రి పద్యము శతావధానసారములో లేదు.

తిరుపతి శాస్త్రిగారు—

బకము న్వడి మ్రింగుచున్న బల్లిం గనుమా" అను సమస్యను—

"ప్రకట తరోన్నతతర స
ద్మ కనత్కుడ్యంబు మీద మహిదేవవరా
యకటకటా లూతా శా
బకము న్వడి మ్రింగుచున్న బల్లిం గనుమా"

అని పూరించిరి

ఈ పద్యమునూ లేదు. ఇందు ముద్రింపబడ్డ నాలుగు సంస్కృత శ్లోకములలోను ఈ క్రింది త్రిమూర్తి స్తుతి మొదటి గ్రంథంలో కానరాదు.

త్రిమూర్తయః (పృథ్వీ)

పురాంతక మురాంతక ద్రుహిణరూపమీడే మహః
కృపామృతఝరీలసన్నయననీరజాతం తతం
సమస్తమునిరాణ్మనః కమలభాస్కరం సత్కరం
సురేంద్రముఖదేవతామకుటరత్నశుంభత్పదం

దీనికి బదులుగా నీ క్రింది శ్లోకమున్నది—

త్రిమూర్తిస్తవః—శిఖరిణీవృత్తం

కనత్కోటీర్యాగ్రస్థగితమణికాండత్విడరుణీ
కృతాశేషాశాంతం సకలమునివంద్యాంఘ్రియుగళం
కృపాపీయుషాంచన్నయనజలజాతం నిరుపమం
మహస్స్వేచిత్తే విధి హరి హరాకార మనఘం. 57

పై వానిని బట్టి శతావధానసారము—ప్రథమ ముద్రణము (క్రీ. శ. 1910)నాటికే మొదటి శతావధాన ముద్రితగ్రంథము లభ్యము కానట్లు స్పష్టము. ఇది లభ్యమై యుండినచో, మూలశ్లోకము నిట్లు మార్పు చేయుట సంభవింపదు. ఇరువదేండ్లయిన వెనుక కూడ తమ ధారణా బలముచే, అందు ప్రకటితములైన పద్యములనుపూరించి తిరుపతి వేంకటకవులు లోకమునకు వెల్లడించిరన్నచో అందతిశయోక్తి లేదు. వారు కాకపోయిన, షష్టిపూర్తి ముద్రణ కర్తలయినను దీని కొఱకు గవేషణ చేసియుండ వలసినది.

బిరుద ప్రదానము

ఈ యవధానము చేసిన వెంటనే తిరుపతి వేంకటకవులకు 'విద్వత్కవి' అని బిరుదము సభ వారిచ్చి

11. ఈ సమస్యను ముప్ఫయిరెండేండ్లయిన తరువాత వేలూరి శివరామశాస్త్రిగారు తాళ్లపూడి శతావధానంలో ఇట్లు పూరించారు.

శా. బంధంబుం బురుణించు నా ప్రణయ
కోపస్ఫూర్తి వేళం బున
స్పంధానంబగు నాప్రసాద గరిమల్
సాధించువేళం గడున్
బంధూకాధరచంద్రమోవదనయౌ
భామాస్యముం జార కామాంధుం
దర్శ నిశీథమందు గనె
నయ్యర్కేందు బింబమ్ములన్.

నట్లేవఱకే తెలిపితిని. అయితే ఈ గ్రంథాంతమున గద్యలో నిట్లున్నది.

గ ద్య

ఇతి శ్రీకింకవీంద్ర ఘటాపంచానన విద్వత్కవి తిరుపతి వేంకటీయ శతావధాన శ్లోకాః

దీనిని బట్టి 'విద్వత్కవి'బిరుదమునకు ముందు గానే వీరు కింకవీంద్ర ఘటాపంచాననులను బిరుదు వహించినట్లు తెలియుచున్నది. ఈ బిరుదమును కాకినాడ సభవారే వీరి కొసగియుందురని నే నభిప్రాయ పడుచున్నాను. దానికి కారణములివి.

1. ఈ అవధానమునకు ముందుగా వీరిరు వురూ గ్రంథరచన చేసి, సభలలో పాల్గొనినట్లు తెలియకుండుట.

2. ఒకవేళ అట్టివి జరిగినను ఆ విషయము గ్రంథస్థము కాకుండుట.

3. వీరి వయస్సులు కూడ పై యభిప్రాయ మునకే తోడ్పడుట.

ఈ అవధానముజరిగినది 25—10—1891 అని తెలిపాను. ఆనాటికి తిరుపతి శాస్త్రిగారి వయస్సు ఇరువది దాటినది.వెంకటశాస్త్రిగారి వయస్సు—ఇరువది యొక్కటి.

శతావధానసారము చదువు చుండగా, కాకినాడ శతావధాన సమయముననే, కింకవీంద్రఘటాపంచానన బిరుదము లభించినట్లు తెలియుట తోడనే నా యభి ప్రాయము సరియైనదని యానందము పొందినాను. వేంకటగిరిలో ద్విగుణితాష్టావధానమున కాళీస్తవమున నిట్లున్నది.

సీ. [12]బాల్యవయస్సులోపలఁ కాకినాడలో
గింకవిగజసింహకీర్తి నొసఁగి
యటుమీఁదికాలమం దమలాపురమునందు
విద్వత్కవీంద్రునద్బిరుదు నొసఁగి
తదనంతరంబు బందరు పట్టణమునందు
బాల కళానిధి ప్రథిత నొసగి
విన్నగాకనుమొన్న నెల్లూరిపురమున
బాలసరస్వతీ భావమొసగి
గీ. కంటికినిఱెప్పవలె మమ్ముఁ గాచినట్టి
కాళి! మాయమ్మ ప్రత్యుపకారమేమి
చేయుగలమమ్మ? నీకు మాచేతనైన
దొక్క మ్రొక్కిచ్చెదము దీనముబ్బ గనుము
(పుట 25)

విజయ సంవత్సరమున నవగ్రా క్రీ.శ.1894లో చెప్పబడిన యీ పద్యమున కాకినాడలో కింకవీంద్ర ఘటాపంచానన బిరుదము సరియైనదేకాని 'విద్వత్కవి' బిరుదము మాత్రము అమలాపురమున బడిసినట్లు చెప్పుట సరికాదు. ఏమనగా, విద్వత్కవి బిరుదము కాకినాడలోనే లభించినట్లేవఱకే తెలుపబడినది. ఈ పద్యము చెప్పునప్పుడు విద్వత్కవి బిరుద విష యము స్ఫురణకు రాకుండుటచే అమలాపురమని చెప్పి నట్లు తోచుచున్నది.[13] తిరుపతి కవుల బిరుదవివరము లివి.

| | |
|---|---|
| 1. కింకవీంద్రఘటాపంచానన | కాకినాడ |
| 2. విద్వత్కవి | కాకినాడ |
| 3. బాలకళానిధి | బందరు |
| 4. బాలసరస్వతి | నెల్లూరు |

పై వానిలో 'బాలసరస్వతి' బిరుద ప్రదాన సన్నివేశము తిరుపతి కవుల సాహిత్య జీవితములో నొక ముఖ్యఘట్టము. దాని వివరణము

మూల స్థానేశ్వరస్తుతి శతకము—
బాలసరస్వతీ బిరుదము

తిరుపతి వెంకటకవులు మూలస్థానేశ్వర స్తుతిశతకము రచియించి, బాలసరస్వతులను బిరుదము పొందినట్లు జాతకచర్యపూర్వార్థమున నిట్లు గలదు.

---

12. ఈ విషయము పరిశీలించిన ప్రస్తుత విమర్శ గ్రంథము—9 వ పుటలో "ఇంకను పూర్తిగా నిరువ దేండ్లయినను నిండలేదు" అని తిరుపతి వెంకటేశ్వర లిరువురిని గూర్చి వ్రాయుట సరికాదని తెలియవలెను. ఈ గ్రంథమున వారి జననమరణ తిథులు కూడ సక్రమముగా నీయబడలేదు. కాబట్టియే ఈ విప ర్యాసము.

13. దీనికంతకు కారణమీ ప్రథమ శతావధాన ముద్రిత గ్రంథము వారికందుబాటులో నుండకపోవు టయే యని యీవఱకే తెలిపితిని.

క. నెల్లూరుచనుటయును నట
నెల్లరునట గౌరవించి యింపుగ సభ న
త్యుల్లాసంబున నొసరువ
జిల్లాజడ్జియును తద్విశేషము వినియున్

క. లీలమెయి గంట లోపల
మూలస్థానేశ శతకమును జేసి కళా
లోలురగు సుధీశులచే
బాలసరస్వతు లనంగ బరగిరి యచటన్
పుట 5.302 ప

ఈ శతకము సంస్కృతభాషలో, నెల్లూరి మూలస్థానేశ్వరుని పేర రచియింపబడినది. ఈ శతకము ముద్రితమైనను, అలభ్యమగుటచేత దాని ముఖపత్రము నీక్రింద నిచ్చుచున్నాను.

శ్రీ ర స్తు
శ్రీమూలస్థానేశ్వరస్తుతి శతకం
తిరుపతి వేంకటీయం
సదాచారవర్ధనీ సభాయాం
ఉపాగ్రసనాధిపతినా
శ్రీ కుప్పుబ్బ లక్ష్మయ్య నామ్నా విదుషా
పరిశోధితం సత్ తేనైవ
సింహపురీస్థ శ్రీ విక్టోర్యాభిద
ముద్రాక్షరశాలాయాం ముద్రాపితం సత్
విజయుతేతరాం
1894

ఈ శతకము క్రీ.శ. 1894 లోనే ముద్రితమైనను, ముందటి గ్రంథమువలె షష్టిపూర్తి ముద్రణ కర్తలకుగాని తరువాతివారికిగాని లభ్యము కాలేదు. పూర్వగ్రంథమువలె దీని యేకైక ప్రతి—ప్రాత—జిలుగుగా నున్నదానిని సంపాదించి, వేఱొక ప్రతివ్రాసి ముద్రింపజేసితిని.[14] దీనిని లోకమెఱుగదు గావున కొద్ది వివరములు.

ఈ శతకమున 103 ఆర్యావృత్తములున్నవి. నాకు దొరకిన ప్రతిలో 86,97,102 సంఖ్యగల శ్లోకములు చినిగిపోవుట చేత తక్కిన 100 శ్లోకములు యథామాతృకముగా ముద్రితమైనవి. శతకాంతమున యీ క్రింది విధముగా గద్యయున్నది. ఆపై నొక స్రగ్ధర ఉన్నది.

ఇతిశ్రీ కింకవీంద్రఘటాపంచానన విద్వత్కవి బాలకలానిధి శతావధాని తిరుపతి వెంకటీయ
మూలస్థానేశ్వరస్తుతి శతకమ్.

స గ్ధ రా వృ త్తం
శ్రీకుప్పుబ్యన్వవాయో వదదిదముదితం
లక్ష్మణాఖ్యో బుధేంద్రం
పద్యానా మద్య వక్తుం శతకమపి దయా
చ్ఛక్తి రాస్తే నవేతి
ఉక్తావావాం తదానీ మతిశయ కవనే
నార్థయామర్ధకాలే
మూలస్థానేశ్వరీయం శతక మిద మహో
దత్తవంతౌ విరచ్య—

ఈ శతక రచనానంతరము 'బాలసరస్వతి' బిరుదమును సభవారొసగిరి. ఈ బిరుదము స్వీకరించుచు, ఆ సభలో అనాద్రగేసరులై యున్న వేదావధాన, వేదవిద్యాధురీణులైన శంకర, మహాదేవ శాస్త్రులను మహావిద్వాంసులను ప్రశంసించుచు నీ క్రింది నమస్కారపత్రమును తిరుపతి వేంకటకవు లర్పించిరి.

నమస్కారపత్ర సమర్పణమ్

1. అబ్ధిః ప్రాక్చులికీకృతో ఘటభువే
త్యేవంవచః కిం మృషా
నో చేత్సత్యమితీవ యేపి విబుధా
స్సందేహ బందీకృతాః
తేసర్వేపిచ శంకరాభిధ
మహాదేవాభిధాలోకనం
కుర్వంత్వాశయ సంశయో నవిశ(మో)
నశ్యత్యవశ్యం బుధాః

2. వర్తంతే భువి యేపి భేదవిషయా
వేదేపునర్యానివా

---

14. దీనిని ప్రకటింపజేసిన కీర్తి నెల్లూరి మూలస్థానేశ్వర దేవాలయ కార్యవర్గ సభ్యులు, విద్యన్మహాశయులు శ్రీ వేలమూతల కృష్ణమూర్తిగారిది. వారికి దీనిని పంపిన తోడనే విక్రమసింహపుర మండల సర్వస్వమున దీనిని ముద్రించి లోకమునకు వెల్లడించిరి. వారికి నా కృతజ్ఞత నిండుమూలముగా తెలుపుచున్నాను. అసలు ప్రతి నావద్ద నున్నది.

స్తోత్రాని ప్రథితాని నీరజభవ
ప్రఖ్యై ర్గమ్యానిచ
తత్రాద్య క్ప్రథితాన (సా) న
విషయోపజ్ఞం జగద్భూషణమ్
శ్రీమచ్ఛంకర పండితం
గురుమహాదేవంచ సేవామహే

3. యస్మిన్ వేదఘనావధాన విలసత్
విద్యాం వద త్యంజసా
స్సర్వేవేదవిదశ్శిరోవినమనం
లజ్జావశాత్కుర్వతే
యత్సర్వేషు ప్రురేష్వపివ్యరచయన్
మూఢాశ్చ విద్వత్తమాః
స్తోత్రం తత్ప్రణమామి శంకర
మహాదేవాఖ్య శాస్త్రిద్వయమ్.

ఇతిశ్రీ కింకవీంద్రఘటాపంచానన విద్వత్కవి బాలకళానిధి బాలసరస్వతీత్యాది బిరుదాంకిత తిరుపతి వెంకటశాస్త్రిభ్యా మత్యంత పరమసంతోష పూర్వం దత్తం నమస్కార పత్రమ్.

ఇది సంస్కృతభాషా శతకమైనను తెలుగు శతకములవలె మకుటము గలిగియున్నది. "మూలస్థానేశ్వరం సదాసేవే" అని మకుటము.

వేదాంత వాక్యసారం వేదవిదాం పాలకం గణ్యం సేవ్యం
సింహపుర వాస మనఘం మూలస్థానేశ్వరం సదాసేవే

ఈ శతక మత్యాశుకవనమున రచితమైనది.

తిరుపతి వేంకట విద్వ
ద్వర కవియుగ్మేన సజ్జనప్రీత్యై
అత్యాశుకవనరచితా
మూలస్థానేశ్వర స్తుతి ర్జీయాత్.

అత్యాశుకవనమైనను, సరళ సుందరశైలిలో బరువుకాని శబ్దాలంకారములతో నీ శతక మొప్పుచున్నది.

"భుక్తిం దదాతి భూప
స్తుష్టశ్చే దథ నచేత్కిమపి నైవ
తద్భుక్తి ముక్తిద మముం. మూ॥"
యదృశ్యం తన్నశ్యం
దృశ్యత్వాన్నశ్యమేవ జగదేతత్
తత్సత్యం నిత్యమముం. మూ॥

[15]తెలుగుభాషలో వలె, ప్రాసలు కొన్నిచోట్ల పాటింపబడినవి.

"త్రిపురాసురాసుహరణం
కపిలాదిమహామునీశ్వరాధారం
కృపణం జనరక్షణ పరం. మూ॥
తారక మనఘ జనానాం
మారకమఘయుక్తచేతసాం నిత్యం
నారకభారవిదూరం. మూ"

ఇందలి శ్లోకముల నెన్నింటినైన నుదాహరింపదగు. అయితే ఒక్కటి మాత్రము వ్రాసి ముగించెదను.

"నిందంతు వా బుధా మాం
నోచే న్నందంతు తత్ర నవిచార
ఇహ పర సాధనమేకం. మూ॥

తిరుపతి వేంకటకవుల తక్కిన సంస్కృత రచనల కన్న ఈ మూలస్థానేశ్వరస్తుతి శతకము ఖ్యాతిని గడించినది. వీరి ప్రతిస్పర్ధులగు వేంకటరామ కృష్ణకవులు.

"మూలస్థానేశ్వర శతకము మూలస్థానేశ్వర శతకమే" (పుట 9) అని తమ 'అట్టహాసము' అను గ్రంథమున వ్యంగ్యముగా నాక్షేపించిరి. ఆ గ్రంథమును "తాలుకుట్టనము" అనుపేర నామూలాగ్రముగ ఖండించి శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు పై యాక్షేపణ కిట్లు ప్రత్యుత్తర మొసగిరి.

మూలస్థానేశ్వర శతి
మూలస్థానేశ్వరమని మూలుగనేలా

---

15. ఈ శతకమున నిందుచూపిన శ్లోకము లన్నియు యథామాతృకముగా వ్రాయబడినవి. విద్వాంసులిందలి దోషములను తెలిపినచో కృతజ్ఞతతో సవరించు కొందును.

చాలుంజాలును పాండితి
నాలుగు గంటలకు జేసినారట భళిరా. పుట16

## అవధాన పునః ప్రతిష్ఠ
## వేలూరి శివరామశాస్త్రిగారు

తిరుపతి వేంకటకవుల జీవితంలోనేకాక ఆంధ్ర దేశ శతావధాన చరిత్రలో క్రీ. శ. 1911 సంవత్సరం సువర్ణఘట్టం. ఆ సంవత్సరం సెప్టెంబరు నెల తే 14 దిని వేలూరి శివరామశాస్త్రిగారు గుంటూరి కాలేజీలో సంపూర్ణశతావధానము చేశారు. ఆశు కవితా సింహములైన కొప్పరపు సోదర కవులకూ తిరుపతి వేంకటకవులకూ వాగ్యుద్ధాలు జరుగుతున్న రోజులవి. గురువుల పక్షాన శివరామశాస్త్రి కిశోర మా సింహంలో

"గంటలుకట్టి కొంటివట
గంటకు వందలు వేలు పద్యముల్
గెంటుదునంచు, నేడు పరికించెద
గెంటుట యెట్టిదో వినుం
గెంటెద నే వధానమున గెల్చెద
వీరసధారయందు నీ
ఘంటికలూడగొట్టెదను
కాచుకొనం గమకింపు మిత్రరిన్17

సవాలు చేసినది. ఆ సవాలుకు కొప్పరపు సోదర కవులు.

"ఆశలడంగి నీ గురులయంతటి
వా రెదిరింప లేక యా
వేశముడక్కి యుండిరిట
చిన్నవు కాగలవాడ విప్పుడే
యాశుకవీంద్రసింహముల
క్రాగహముం గలిగింపబోక
వత్సా! శివరామశాస్త్రి!
సుగుణాఢ్యుడవై యశముం గడింపుమీ"

అని సౌజన్యంతో ప్రత్యుత్తరించారు. వారా నాడు "చిన్నవు కాగలవాడవు" అన్నమాటలు నేడు సార్థకములైనాయి. శివరామశాస్త్రిగారు పెద్దలై ఆంధ్ర సాహిత్య ప్రపంచానికి 'అయినవారయినారు.' అఖండ యశమూ ఆర్జించారు.

శతావధానం నాలుగురోజులు జరిగింది. అవధాని గారి ప్రతిభకు తెలుగు తెలియని ఆంగ్లేయులు కూడా ఆశ్చర్య చకితులైనారు. ఇక సభ్యమహాశయులా, ప్రశంసలకు లెక్కయేలేదు. శతావధానమా, సంపూర్ణము. వయస్సా, ఇరువదేండ్లు. అదీ గురువుల సమక్షంలో. అవధానానంతరం, శివరామశాస్త్రిగారిని చేసిన పండిత కవుల ప్రశంసా పద్యాలు శతావధానంలో నూరు పద్యాలను మించియున్నవి.వానిలో 50, 63 చరణాలు గల చంపకమాలికలే గాక 7 సంస్కృత శ్లోకములు ఉన్నవి. తిరుపతి వేంకటకవుల అవధానానంతరములలో కూడా ఇన్ని పద్యప్రశంసలు లేవు. శివరామశాస్త్రి గారి తెనాలి శతావధానానంతరము పండిత కవులు చెప్పినవి 57 పద్యాలు మాత్రమే. కాబట్టి ఆంధ్రదేశ అవధాన చరిత్రలో నిది అతివిశిష్టమైన అవధానము.18

---

16. అట్టహాసము (1913). తాలుకుట్టనము (1914). ఇవి ఈనాటి వారికి పరిచితములు కావు. అట్టహాసము వచనమేకాని 'తాలుకుట్టనము' పద్య కృతి. ఇందు 116 పద్యములున్నవి. తొలిపలుకులో 18 పద్యము లున్నవి. తాలుకుట్టనము, కేవలము వివాదగ్రంథము గాదు. సంస్కృతాంధ్ర భాషావైయాకరణ ప్రయోగ మర్మము లెన్నియో ఇందున్నవి. చెళ్లపిళ్ల వారు 'జయంతి'లో ఉదాహరించిన ప్రయోగములు చాలావఱకు ఇందులోనివే.

17. ఈ పద్యంలో అతిశయోక్తి ఏమాత్రమూ లేదు. ఆశుకవితలో కొప్పరపు సోదరకవులను మించిన వారాకాలములో కాదు, ఈ కాలమున గూడలేరు. గంటకు ఆశువుగా పద్యములు ఏ కథనైనా, నానావిధ వృత్తములతో కావ్యశైలిని చెప్పేవారు. ఒక మారు మార్చేరు సభలో గంటకు 720 పద్యాల చొప్పున అరగంట కాలంలో మనుచరిత్ర ఆశువుగా చెప్పారు. అయితే వీరి ఆశుకవితా రచనలు వ్రాతలో లేవు. అవి వ్రాసియే యుంచినట్లయితే "మూడు లక్షల కెచ్చుగా గలవని సహృదయుల యభిప్రాయము." (హైమవతీ పరిణయము, ఆధునిక కవి జీవితములు. పుట 32 (1913).

18. ఇందలి అత్యద్భుత కవితా విశేషములను వివరించడాని కవకాశములేదు. పాఠకులు మన్నింతురు గాక.

ఈ అవధానానంతరమే, తామంతకు ముందు ఇరవై రెండేండ్లుగా పరిపాలిస్తూన్న—

"శతావధాన సామ్రాజ్యభారాన్ని" శ్రీ శివరామ శాస్త్రిగారిపై మోపుచు, తిరుపతి శాస్త్రిగారీ క్రింది రీతిగా శిష్యుని ఆశీర్వదించారు.[19]

మ. జగతీనాథులు పెక్కుమంది ముదిత
స్వాంతంబులం గాన్క లం
పగ సాంగంబు సలక్షణంబుగ
శరద్వ్యావింశతిం బేర్మిమై
చ్చగ మాయేలిన యీ వధానకవితా
సామ్రాజ్య భారంబు మో
యఁగఁ బూనంగదవయ్య తండ్రి!
శివరామయ్యా! చిరంజీవివై

మ. రిపులేతెంచిన రూపడంచుచు
ధరిత్రీనాథు లర్పించు న
య్యుపదల్ గైకొనుచుం బ్రమత్తుఁడవుగా
కుద్యన్నవేందుండవై
విపరీతంబగు త్రోవఁ బోక
కవితా వీరుండవై వర్ణనీ
య పరాక్రాంతి వహింపుమయ్య
శివరామయ్యా! చిరంజీవివై

శా. బాల్యోద్రేకమునై నెదిర్చితివి
క్రొవ్వంపుం గవిం గ్రంథపా
కల్యంబున్నదొ లేదొ యంచు
మతినీకై గొంకు వన్మన్నన
శ్శల్యంబెంతయు నూడదీసితివి వత్సా!
సద్యశోభాసివై
కల్యాణంబులఁ బొందుమయ్య యిక వీకన్
శిష్యచూడామణీ

మ. అవనీదేవులు విస్పమానకవితా
వ్యాపార పారీణ సం
భవ పీయూష రసాభిషిక్త లలిత
వ్యాహారనీహారువై
యవలోకింప శతావధానమున
మాకానందముంగూర్చి గా
రవము న్నిల్పితివయ్య మా ఋణము దీఱన్
శిష్యచూడామణీ!

శా. స్వర్ణీలావతులెల్ల రద్భుత పద
వ్యాపార మేపార మా
చర్ల బ్రహ్మసుధీగురూత్తముని
వాచాపూర్తిం గీర్తింపఁగా
గీర్వాణంబునుగోరి మాదరికి భక్తిన్
శిష్యులై తేరఁగా
దర్పంజేసితి వస్మదీయ
గురువిద్యావంశచూడామణీ

ఈ అయిదు పద్యాలు తిరుపతిశాస్త్రిగారి కవితారచనకైదు రత్నపు మచ్చుతునకలు.

గురువుల ఆజ్ఞావశవర్తులై శివరామశాస్త్రి గారు—గుంటూరిలో శతావధానమైన మఱి మూడు నెలలకే తే 23—12—1911 దిని "తెనాలి శతావధానము" గావించిరి. అదియును గురువుల సమక్షమున గావించినదే. ఆ సందర్భమున శతావధాన సభ వారు శివరామశాస్త్రిగారి కొసగిన రూ. 116 లును, వేరొకసభవారొసగిన రు. 25 లును గురువులయందు భక్తివిశ్వాసములు ప్రకటమగునట్లుగా శ్రీ తిరుపతి శాస్త్రిగారి కా ద్రవ్యమును సమర్పించారు. ఈ అవధాన ప్రారంభంలో తిరుపతిశాస్త్రిగారీక్రింది పద్యం చెప్పారు.

శా. హృద్యంబైన భవద్యశోగరిమ
మా యీ పేర నల్దిక్కు లం
దుద్యచ్చంద్రునిఁ జేసి నిల్పితిఁక
శిష్యుండైన యీ బాలుచే
నద్యారబ్ధ శతావధాన మనవద్యంబుం
బొనర్పించి మా

19. శతావధానం. వేలూరి శివరామశాస్త్రి, ఆంధ్రపత్రిక వారపత్రిక సువర్ణోత్సవ సంచిక 1959. పుటలు50—51— 61—63. ఇందు పై పద్యములలో మొదటి పద్యము మాత్రమే ఉదాహరింపబడి యున్నది. తరవాయి పద్యముల నిందు ప్రకటించితిని.

విద్యావంశము పేరునిల్పఁగదవే
విద్యారతీ! భారతీ![20]

లక్ష్మీనరసాపుర శతావధానము

శ్రీ రావు చెల్లాయ్యమ్మారావుగారి షష్టిపూర్తి మహోత్సవ సమయంలో 9—11—1914 జరిగిన అవధానములో వెంకటశాస్త్రిగారు జ్వరపీడితులవుట చేత శివరామశాస్త్రిగారే తిరుపతిశాస్త్రిగారితో అవధానము పూర్తి చేశారు. ఆ సమయమునసే శివరామ శాస్త్రిగారు అష్టావధానం చేశారు. అప్పుడు ప్రారంభంలో

శా. ఏనేకాక బుధాగ్రగణ్యులగు వారేనిన్
[యదీయస్ఫురత్
జ్ఞానోద్భూతి విమేషభావములుపో
సద్యంబ దర్శించి ని
త్యానందంబును గాంచువారలో
నితాంతాసక్తిమై నట్టి శ్రీ
ధనుల్ తిర్పతి వేంకటేశ్వరులకున్
దాసానుదాసాత్ముడన్
అని గురుస్తుతి చేశారు.

పునః ప్రతిష్ఠ

శ్రీ తిరుపతి శాస్త్రిగారు కీర్తిశేషులైన తరువాత శివరామశాస్త్రిగారు చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారితో కలిసి తేతలిలో అవధానము చేశారు. తిరుపతి కవుల చివర అవధానము 'తేతలి శతావధానము'' అని చెప్పాలి. అందుండి రెండు పద్యాలు శివరామశాస్త్రిగారు చెప్పినవి ఉదాహరిస్తున్నాను.

తేతలి శతావధానము

ఉ. అల్లశతావధానమున కక్కఁ
తిర్పతియొజ్జవల్లనా
యుల్లకమబ్బఁ జింతిలెడు
వాంధ్రులు మోదిలఁగాఁ కళామహో
ఖిల్లుడు వేంకటేశకవివీరునిచే
శివరామ శాస్త్రిచేఁ
జెల్ల శతావధానమును
జేయఁగఁజేసితి వౌర తేతలీ!

బాణకవి

శా. ప్రాక్కాలంబున నేటి కాలమున పై
రాఁబోవుకాలాన నీ
ఫక్కిన్ సత్కవితన్ రచించునె యనన్
ప్రాముఖ్యముం జెంద నీ
దృక్కవ్యంతరుఁ డుండ బోఁడనుచున్
శ్రీ హర్షుఁడే తెల్పె తా
దృక్కున్ బాణు వచఃప్రవీణుఁ
దలఁతున్ దీవ్యత్కశాస్త్రపాణునిన్.

తాళ్లపూడి శతావధానము

శివరామ శాస్త్రి గారు తాళ్లపూడి శతావధానంలో అవధానాన్ని పునః ప్రతిష్ఠితం చేస్తూ ఇలా చెప్పారు —

మ. అవధానంబది నూఱు మందికిని
చేయం జేయఁ గొన్నాళ్లకున్
దవులౌందెన్ (మరి) నంతకుం బయిని
కొన్నాళ్లగ నస్మద్గురు
ప్రవరుల్ తిర్పతి వేంకటేశ్వరులు
పావం బోతివా నీవు నో
యవధానంబ పునః ప్రతిష్ఠితము
సేయం జాతు నేవియ్యెడన్

ఉ. తిరుపతి వేంకటేశ్వరులు దేశము
లెల్లను ద్రిప్పి త్రిప్పి యు
బ్బురముగ నాదు మూఁపునను
మోపిన మోపితి దానఁ జేసి దు
ర్భరముగు నుబ్బునంబు తన భారము
మోపిన మోయు చుంటి నీ
బరువిక వీడ నెంచెద నెవండు
కనంబడడో వధానమా!

పై విషయములను బట్టి తిరుపతి వేంకట కవుల సాహిత్య జీవితములో పూర్వరంగముగు శతావధానమున తిరుపతిశాస్త్రిగారి కెంత ప్రాధాన్యత యుండెడిదో స్పష్టము కాగలదు. తిరుపతి శాస్త్రి గారి యత్యద్భుత ప్రతిభా సంపత్తియు, వేంకటశాస్త్రిగారి యఖండ కవితా శక్తియు,

20. ప్రస్తుతగ్రంథమంతయూ వెంకటశాస్త్రిగారిని గూర్చియే యున్నదిగాని తిరుపతి శాస్త్రిగారి ప్రత్యేక వ్యక్తిత్వము నిరూపించు కవితారచన లీయబడి యుండలేదు. అది ఒక ప్రత్యేక శీర్షికగా వ్రాయదగినది.

గంగా యమునల వలె నేకీభావమును పొంది— ఆంధ్ర సరస్వతీ క్షేత్రమున శతావధానప్రక్రియ చిరస్థాయి గావించినవి.

ఒకప్పుడు నర్సారావుపేట శతావధాన సందర్భములో అవధానానంతరం, వెంకటశాస్త్రి గారిని గురువుగా పేర్కొనుచు, తిరుపతిశాస్త్రి గారు చెప్పిన యీ క్రింది పద్య మెంత రసభావ భరితమో చూడండి.

"వితతాత్మీయ శతావధాన కవితా
విద్యాపయోరాశి, సం
భృతశిష్యాంబుద వాఙ్మయామృత ర
సప్రీతాఖిలాంధ్రక్ష్మా
ధృతరజ్యద్రసికావతంసకృత వంది
స్తోత్రమాలా విభూ
షితు మా వేంకటశాస్త్రి నే బొగడెదన్
శిష్యస్వరూపమ్మునన్"

ఇట్లే వేంకటశాస్త్రి గారు, తమ రచనలో, తిరుపతిశాస్త్రిగారి గుణ విశిష్టతలను ప్రశంసించుచునే వచ్చారు—మచ్చుకు రెండు.

"మ. ధృతిపట్లన్ మతిపట్ల
సంపదుదయ దృక్శక్తి దోశ్శక్తిఁ బ
ర్వతి నాకన్న బలాఢ్యుఁడయ్యుఁ
జిర మబ్బం బోవ దాయుస్సు"
జయంతి (పుట 20.)

చ. తిరుపతిశాస్త్రి దక్క గణుతింపని
నే వితవిం గణించి మా
విరచన నున్న భాగవతవీథినిఁ
జోటు నొసంగి నట్లు ధీ
వరమణు లెల్ల వారెఱుఁగు వారలె,
నాకొననేల దీనికిన్
దిరుపతి గూడ యొప్పుకొనె
దేవునిసైతమతండు మెచ్చునే

(పండిత అకొండి రామమూర్తి శాస్త్రిగారి సప్తతి మహోత్స వాభినంద నాశీస్సు.)

తిరుపతి వేంకట కవుల శతావధానము లన్నియు శ్రీ వేలూరి శివరామ శాస్త్రిగారి శతావధానములతో గూడ, సమగ్రముగా సంపాదించి, విశేష వ్యాఖ్యానములతో ప్రకటించి నట్లయితే— తిరుపతి వేంకటకవుల సాహిత్య ప్రతిభా విశిష్టత యింకను వెల్లడి యగుటయే గాక— ఆంధ్ర వాఙ్మయ చరిత్రలో అదియొక ముఖ్య గ్రంథముగా భాసిల్ల గలదు. (సశేషము)

---

రచయిత : శ్రీ ఎస్. లక్ష్మీకాంతశాస్త్రి, నిర్మలా పబ్లిషర్స్, కుమ్మరివీధి, విజయవాడ, వెల రు. 10—00.



# ప్రాణిని గురించి కొన్ని కొత్త విషయాలు-I

శ్రీ "ఎల్. ఎల్."

ప్రాణాన్ని గురించి, సత్పదార్థం యొక్క సర్వవిధ స్వరూప సంపదను గురించి, జీవజాలముపుట్టుక, స్థితి, అభివృద్ధి, ప్రజననము, సంస్థాన విశేషములను గురించి వివరించెడి శాస్త్రమును Biology అనుచున్నారు. అనగా జీవశాస్త్రము అని అర్థము. ఈ శాస్త్రములో బహుమంది శాస్త్రవేత్తలున్నారు. వీరు యీ శాస్త్రమును ఒక్కసారిగా పూర్తిగా తెలుసుకొనలేదు. కొంత కొంతగా తెలుసుకొనుచూ వచ్చియున్నారు. ఒక్కొక్క విషయమును తెలుసుకొని దానిని వారు ఆవిష్కరించి నప్పుడల్లా ఆ శాస్త్రము, దానితోపాటు మానవ విజ్ఞానము పెరుగుచూ వచ్చినవి. అసత్పదార్థానికి సత్పదార్థానికి తేడా ప్రాణము వుండటంలో, లేకపోవడములో ఉన్నది. అసత్పదార్థమనగా ప్రాణములేని ద్రవ్య విశేషమని అర్థము. సత్పదార్థము ప్రాణవిశిష్టమైన ద్రవ్యము. ఇటువంటి ద్రవ్యవిశేషములు అనంతముగా నున్నవి. వీనిని అన్నింటిని మనము జీవజగత్తు క్రింద పరిగణింప వచ్చును. ఈ జీవజగత్తు రహస్యములను గురించి పరిశోధనలు ఇంకా సాగుచునే వున్నవి. అయితే ఈ పరిశోధనలలో 1953 లో జరిగిన పరిశోధన, ఆ పరిశోధన వలన తేలిన అంశములు విప్లవాత్మకమైనవి. మెండెల్ పరిశోధనజరిపి తేల్చిన అంశములు ఎంత గొప్పవో, ఈ అంశములు అంత గొప్పవి.

జీవజాతములో ఒకరకమైన ద్రవ్యము వున్నది. దాని సంగతి 1953 నకు పూర్వము తెలియదనికాదు. తెలుసును. కాని దీని నిసర్గ లక్షణము ఇది అనిగాని, దీనివలన యీ పని జరుగుతున్నదని కాని తెలియదు. ప్రాణము అంటూ ప్రతిజీవిలోను—అది స్థావరమైనాసరే, జంగమమైనాసరే—Plasm అంటూ వున్నది. ప్రాణిలో బహురకముల కణములు, లేక Cells వున్నవి. ఈ కణములలో వుండే ప్రాణధాతువునకు Plasm అని పేరు పెట్టుటయైనది. దీనితో కూడిన ఒక భాగమును Germ Plasm అనుచున్నారు. ఇంగ్లీషులో దీనికి అర్థము ఇట్లా చెప్పబడి వున్నది: The nuclear part of... cell by which according to weismann's theory hereditory characterestics are transmitted అని వున్నది. ఇది సరిగా అర్థము కావలెను అంటే Nuclear part of a cell అనిన నేమియో తెలియడము అవసరము. Cell అనగా కణము అనుకున్నాము కదా! ప్రోటోప్లాజము అన్నది ఈ కణములో వున్నది. ప్రోటోప్లాజము చుట్టూ ఒక పొర వంటిది వున్నది. ఈ పొరతో చుట్టబడి వున్న ప్రోటోప్లాజమును కణము అంటున్నారు. సర్వమైన జీవ సంస్థానానికి ఇది ఆధారభూతమైనటువంటిది. ఈ ప్రోటోప్లాజము ఎచ్చట ఈ జీవకణములో రాశి కట్టి వున్నదో, ఆ భాగమును Nucleus అన్నారు. పైన చెప్పిన "Nuclear part" ఇది. దీనికి నైసర్గికవంశక్రమానుదానశీలమైన లక్షణమువున్నట్లు Weismann శాస్త్రవేత్త తెలుసుకున్నారు. అయితే దీని ప్రధాన లక్షణము ఇంతకన్నను విశిష్టమైనట్టిది. ఆ విషయము 1953 లో ఆవిష్కృతమైనది.

ఈ Germ plasm లేక ప్రాణధాతు రాశి అన్నది ఒకరకమైన Molecule లో వున్నది. Molecule అనగా ఒక అణువుగాని, లేక రెండు అణువులుగాని, లేక కొన్ని అణువులుగాని కలిసి ఏర్పడి

నటువంటిది. ఇప్పుడు ఈ Germ plasm వున్న Molecule పెద్దది. శాస్త్రవేత్తలు దీనిని Gaint molecule అన్నారు. ఇది జమిలిగా పేనినట్లు వుంటుంది. చుట్టలు చుట్టలుగా వుంటుంది. దీనికి DNA molecule అని పేరు పెట్టారు. అనగా Deoryribonucleic acid అని. క్లుప్తంగా DNA molecule అన్నారు. దీనిని గురించి పరిశోధన జరిగినది. ఈ molecule లో ఏమి వున్నది తెలియవలెను అని శాస్త్రజ్ఞులు ప్రయత్నము ఆరంభించినారు. ఈ ప్రయత్నము లేక పరిశోధనము వలన తేలిన విషయములు ఇవి. దీనిలో రసాయనములు ఒక పద్ధతిలో వున్నవి. ఆ పద్ధతి పరిణామశీలము కల్గినటువంటిది. అనగా మార్పులను కల్గించేదిగా వుంటున్నది. సంస్థానము లేక నిర్మాణము (Structure) నందు నేమి, లేక దాని ధర్మమునందునేమి యీ మార్పులు సంభవము కావచ్చును. అట్టి పద్ధతి DNA molecule లో వున్న రసాయన విశేషములకు వున్నది. ఈ పద్ధతి ఏవిధముగా వున్నదో ఆ విధమును బట్టి, దీనికి ఒక "నిబంధనము" లేక ఒక "సంహిత" (code) సన్నిహితము అయివుంటున్నది. ఈ నిబంధన సత్తా చేత ఇది సజీవకణము యొక్క ప్రజనన శక్తిని, అభివృద్ధిని కూడా ఏలుచున్నదౌతున్నది. అనగా ఆ ప్రజననమును, ఆ అభివృద్ధిని శాసించుచున్నది. ఈ అనుశాసనము ఆ Molecule నందలి రసాయనముల విధమును బట్టి జరుగుతూ వుండు నన్నమాట. ప్రతి సజీవకణమునందు, జీవి యందు ఇది ఇట్లానే జరుగుతూ వున్నది. కొన్ని వేల Protein molecule లు కలిసి ఒక ఆకృతిగా నిర్మితిని చెందుతూ వున్నవి. ఈ ఆకృతి విశేషము ఏర్పడు పద్ధతిని ఈ నిబంధనము అనుశాసించుచున్నది. ఆ protein molecule లు ఎట్లా సంహితిని చెందాలి, ఎట్టి ఆకృతిని వహించాలి అన్నది అంతయు ఈ నిబంధనము యొక్క శాసనము వలన జరుగుతూ వున్నది. మరియు ప్రాణము యొక్కయు, ప్రాణిజాతము యొక్కయు క్రమ నియమిత విధి విధానములను (Regulatory mechanisms of life) గూడ నిది అనుశాసిస్తూ వున్నది. ఇప్పుడు ఆ "నిబంధనము" యొక్క రహస్యము ఏమో తెలిసికొనబడినది. పరిశోధకులు ఇప్పుడు దాని యొక్క బహువిధ వివరములను గురించి అన్వేషణము కొనసాగిస్తూ వున్నారు.

1960లో ఇంకో విషయమును శాస్త్రజ్ఞులు తెలుసుకున్నారు. DNA వున్న దంటే, అదిఒక కణము యొక్క ఆకృతి విశేషన్ని, దాని ధర్మాన్నేగాక బహుకణములయొక్క క్రమాభివద్ధి నిగూఢఅనుశాసించగల్గుతూ, వానివలన మానవునివంటి క్లిష్టమైన జీవి రూపు పొందేట్లు చేస్తూ వున్నది. ఏపద్ధతిని అనుసరించిDNA వలనఇది సాధింపబడుచున్నది? ఇప్పుడు ఈ విషయాన్ని శాస్త్రజ్ఞులు ఛేదించడానికి విధి విరామము లేకుండా పరిశోధనలుసాగిస్తూ వున్నారు. ఇప్పుడు DNA వలన జరుగుతున్న క్రమ నియత విధి విధానానికి కీలకము ఏమిటి? ఈ విధానంవల్ల ఆయా కణములు వ్యవస్థానము చెందుటయేగాక, అవ్యవస్థను చెందడము కూడా జరుగుతూవున్నది. ఒకమూలయీపరిశోధనలుజరుగుతూ వుండగానే ఇంకొక రకము పరిశోధనలు ఇంకొకమూల కొనసాగుతూ వున్నవి. 1953 లో ఒకపెద్ద పరిశోధన, 1960 లో ఇంకొకటి, ఇప్పుడు ఇది. ఇది మూడో తరంగం. ఈ తరంగము యొక్క గమనము ఈ విధముగా వున్నది. మనుష్యునకు నేర్చుకోవాలన్న ఆసక్తి వున్నది. నేర్చుకుంటున్నాడు. నేర్చుకున్న దానిని జ్ఞాపకము పెట్టుకోవాలన్న దీక్ష వున్నది. జ్ఞాపకము పెట్టుకొనుచున్నాడు. ఈ నేర్చుకొనడాన్ని అధ్యయనమని లేక జ్ఞానసముపార్జనమని మనం అనవచ్చును. జ్ఞాపకం పెట్టుకునే శక్తికి ధారణ అని ఎట్లాగూ పేరు వుండనే ఉన్నది. ఈ పనులు మనస్సు వలన జరుగుతూ వున్నవి. ఎట్లా జరుగుతూవున్నాయి? ఇందును గురించి పూర్వమే కొంత పరిశోధన జరిగి వున్నది. ఆ జరిగిన పరిశోధన ఆధారముగా ఇప్పుడు ఈ మూడవ పరిశోధన తరంగము ఆరంభము అయినది. మనుష్యునిలోనేమి, ప్రతిజీవి యందు నాడీమండలము వున్నది. మనస్సు వుంది. మనుష్యునియందు ఇవి పెద్దగా అభివృద్ధిచెంది క్లిష్టమైన స్థితిని పొంది వున్నవి. ఈ నాడీమండలానికిన్నీ, ఈ మనస్సునకున్నూ సంబంధం వున్నది. మరల యీ రెంటికిన్నీ Genetic substance కున్నూ సంబంధం ఉన్నది. ఇచ్చట Genetic substance అనగా నేమో చెప్పవలసి ఉన్నది. geneలు అని వున్నాయి. విత్తువంటిదని చెప్పదగిన ప్రతి బీజకణము నందును ఈ "జీన్"లు అన్నవి యున్నవి. ఒక భార

తీయు శాస్త్రజ్ఞుడు gene అన్నమాటను "జీవా-
ణువు" అని తర్జుమా చేసి ఉన్నారు. కనుక ఇప్పుడు
మనము ఈ 'Gene' లను జీవాణువులని యందము.
బీజ కణము వున్నది కదా!దానిలో ఇట్టి జీవాణువులు
రెండు వున్నవి. ప్రతి బీజ కణము (germ-cell)
లోను ఇంతే. ఇందులో ఒక 'అణువు' తండ్రి వలన,
రెండవ 'అణువు' తల్లి వలన సంక్రమిస్తూ వున్నాయి.
వీని వలన సంతానమునకు వీతద్వంశక్రమాగత లక్షణ
ములు, మార్పులు, ఇతరములైన లక్షణములు మరి
కొన్ని సంక్రమిస్తూ వున్నవి. సారూప్య రూపతారతమ్య
స్థితులకలిమి ఈ జీవాణుకర్షణ క్రియాకలాపమునకు
కారణము అవుతూ వున్నది. ఇందుకు పరిసరములు
గూడా ఉద్దీపకము కావచ్చును. ఇటువంటి లక్షణముల
చేత లక్షితమైన పదార్థ విశేషము ఏది వున్నదో (అనగా
genetic substance) దానికిన్నీ, ఈ నాడీమండలము,
ఈ మనస్సు వీటికిన్నీ సంబంధము వున్నది. ఇప్పుడు
ధారణము, అధ్యయనము అన్న స్థితుల విషయమున
కూడా ఈ సంబంధం వున్నది. అటువంటి పట్టులలో
లభ్యమైన వున్నవిషయములు ఆధారముగా ఇప్పుడు
పరిశోధనలు కొనసాగుతూవున్నాయి. ఈ పరిశోధనల ఫలి
తములవలన జీవశాస్త్రములోనేగాక,వైద్యశాస్త్రములో
కూడా విప్లవాత్మకమైన మార్పులు రావచ్చునని
శాస్త్రజ్ఞులు చెబుతూ వున్నారు. మనుష్యుని భవిష్యత్తే
మారిపోవచ్చునంటున్నారు. ఈ పరిశోధనల వలన
మనుష్యునకు లభ్యంకాగల శక్తులు మంచికిగాని,
చెడుకుగాని అమేయమైనవిగా వుండగలవని అంటు
న్నారు. అసలు జీవి జన్మకు జీవాణు స్థితియందు గదా
సత్తా ఏర్పడి వున్నది! అచ్చటనే మానవుని జీవిత
లక్షణాన్ని మార్చివేయగలమహత్వపూర్ణమైన మహత్తు
యీ పరిశోధనల వలన మానవుడికి లభ్యం అవుతుంది
అంటున్నారు. బహుజన సమూహము యొక్క లక్ష
ణాన్ని, శీలాన్ని మార్చవచ్చునని, ఆ బహు జనముల
లక్షణములను అదుపులో పెట్టవచ్చునని, వశీ
కరణము చేసుకొనవచ్చునని, కేవలము మానవ జాతి
నాగరకత సభ్యతాసంస్కారములనే మార్చగలశక్తిసామర్థ్య
ములు కలుగవచ్చునని అంటున్నారు.

జీవశాస్త్ర పరిశోధనము నిజముగా ప్రారంభము
అయి ఇప్పటికి 100 సంవత్సరములు అవుతూ వున్నది.
ఆ వంద సంవత్సరముల క్రిందట గ్రెగోర్ మెండెల్
అన్న ఒక మతోద్యోగి జీవాణుశాస్త్ర పరిశోధనకు
బీజావాపం చేశారు. ప్రాణశక్తికి, జీవజగత్తుకు సంబం
ధించిన జ్ఞానము మానవునకు గోచరము కాకుండా
అడ్డవస్తూ వున్న అవిజ్ఞానపు తెరలను తొలగిం
చారు. D N A అన్నదాని ఉనికివిగూర్చి మొట్ట
మొదటిసారిగా లోకానికి చెప్పినవాడు ఆయనే. అప్పటి
నుంచిఇప్పటివరకుఆ D N Aను గురించి పరిశోధనలు
జరుగుతూనే వున్నవి. 1953 లో దానియొక్క
ఆకార సంస్థాన విశేషాలు ఇట్టివి అని తెలియవచ్చింది.
ప్రతి సజీవకణము నందలి క్రోమోజోములలోను,
ఈ D N A వున్నది.దాని ఉనికి లేక స్థానము ఇట్టి
దని తెలియబడినది. దానియొక్క నిబంధన పద్ధతి,
అది చేయు పనులు అవిష్కరింపబడినవి. భూమి మీద
ప్రజననము, అభివృద్ధి అన్నవి కొనసాగుతూ వున్నవనగా,
వానికి ఇది కారణముగా ఎరుగబడినది. ఇది అనుట
కంటే, అందులో నున్న రసాయవభాగ విశేషసంస్థా
విశిష్టమైన నిబంధన పద్ధతి వలన ఇది అంతయు
అనగా, ఈ క్రియాకలాపమంతయు జరుగుచున్నది
అనగా వలనువడుతూ వుంది.

ఇప్పుడు ఏ మహా రహస్యం అయితే ఆవిష్క
రింపబడినదో, దానిని తెలుసు కొనుటకుగాను గడవ
బడిన మార్గం అతి దీర్ఘమైనట్టిది. ఒక cell లేక
కణముయొక్క కేంద్రస్థానము నందున్న క్రోమో
జోములు న్యూక్లియో ప్రోటీన్‌ల మూలమున ఏర్పడిన
వన్న విషయము తెలుసుకొనబడి ఇప్పటికొక్క శతాబ్దము
నకు పైగా గడిచిపోయినది. ఈ న్యూక్లియో ప్రోటీ
నులు న్యూక్లిక్ అసిడ్, మరియు ప్రోటీన్‌ల సమ్మి
శ్రణము వలన ఏర్పడిన విషయము గూడ నెంత
కాలము క్రిందటనో తెలియబడినది. 1869 లోననే
న్యూక్లిక్ అమ్ల సంబంధమైన DNA ను పృథక్క
రణము చేయుట కూడ జరిగియున్నది. ఆ తర్వాత
చాలకాలము గడిచిన అనంతరము మరియొక రకము
నకు చెందినదియైనను, తొలి అమ్లముతో సన్నిధ
ముల చుట్టరికము కల్గినటువంటి మరియొక రక
మైన న్యూక్లిక్ అమ్లపు cells లేక కణములు
యందున్నట్లు తెలియుటయైనది. ఈ కొత్త ద్రావ
ణమునకు Ribonucleic Acid అని శాస్త్ర
జ్ఞులు నామకరణము చేయుటయు కూడ జరిగి
వున్నది. శాస్త్ర పరిభాషలో ఈ రెండవ దానిని

మూడు పొడి యక్షరముల చేత నిర్దేశించుచున్నారు. R N A అనుచున్నారు. – అనగా Ribonucleic Acid అని అన్నమాట.

ఈ ద్రావణములు లేక అమ్లములు తెలియబడినవే గాని అవి చేయు పనియేమో తెలియులేదు. ఇచ్చట ముఖ్యమైనది ప్రోటీను గనుక, ఆ ప్రోటీనునకివి అనుషంగిక ద్రవ్యములై యుండునని శాస్త్రజ్ఞు లనుమానించిరి. మరియు ప్రాణమునకును లేక జీవమునకును ఈ ప్రోటీను అతి ప్రధాన ద్రవ్యముగా పరిగణితమగుచున్నందు వలన వారికిట్టి యూహ కల్గుటయు సహజము. ఇక క్రోమోజోములలోని ప్రోటీను భాగము యొక్క రహస్య మింకను అట్లులే యున్నది. శాస్త్రజ్ఞులా రహస్యమును భేదించునప్పటినుండియు పడిన యాతనలు చెప్పరానివన్నచో నిక వేరుగా నేమియు చెప్పనవసరము ఉండదు.

అప్పటి కింకను Biochemistry శైశవము దాటి గడచినది లేదు. పట్టి ప్రాథమికమైన స్థితిలో నున్నది. అందువలన కూడా శాస్త్రజ్ఞులీ రహస్యమును తెలియజాలుటకు సాధ్యము కాలేదు. ప్రోటీను, DNA ల వంటి మిశ్రణములను రసాయనికవేత్తలు విడమరచ గలరు. విశ్లేష చేయుగలరు. మరి ఇవి ప్రాణి జాతము యొక్క సంస్థాన విశేషమునందు ఏవిధముగా సంఘాతములైనవి? సంనిపాతమును చెందినవి? ఇది తెలియుట శాస్త్రజ్ఞుల కసాధ్యమైనది. వారికిది ఇట్లుగా జరిగి వుండవచ్చునన్న అభిసంధి వంటి యూహయు కూడ తట్టలేదు. 1920 నాటి దాకా ఇది ఇట్లులే అగమ్య గోచరముగ నుండిపోయినది. ఆ పదియును తొమ్మిదివందల యిరువదిలో నొక్క రహస్యము వారికి దృష్టిగోచరమైనది. అది యేమనగా–ప్రసిద్ధములైన సర్వజీవ ద్రవ్యములును, అల్పములును పౌనఃపున్యములునునైన రసాయనికవు "యూనిట్ల" ద్వారమున బృహత్కణములు (Molecules) ఏర్పడుచున్నవనియు, వానియొక్క ప్రకృష్ట నిర్మాణ విశేషముల యందలి వైవిధ్యము మూలమున వానికి వేరు వేరు లక్షణములు, గుణములు కలుగుచున్నవనియు శాస్త్రజ్ఞులు తెలియగల్గిరి. ఈ మహా రహస్య భేదనమున చేసియే రసాయనిక పరిశ్రమల యందు "ప్లాస్టిక్కులు", "ఫైబరులు" మొదలగు విశ్వామిత్ర సృష్టి యనదగు వస్తుజాతమంతయును ఉద్భవమైనది. అయితే ప్రాణికి సంబంధించిన బృహత్కణ జాతములు మరియు ప్రకృష్టములు, మరియు క్లిష్టములైనవగుట ఇచ్చట తెలియవలసి యున్నది. వీనిని శాస్త్రజ్ఞులు Super Molecule లు అన్నారు. మనము భూమకణములనవచ్చు.

ఈ భూమకణముల నిర్మాణమును గూర్చిన, సంస్థానమును గూర్చిన, గుర్తులను గూర్చిన రహస్యము లేవో 1928 లోగాని తెలియబడలేదు. ఆ తెలియబడగా నివి మారుమూల దేశముల యందు, అనుకొనని స్థలముల యందు ఉండుచున్నట్లు తేలినది. ఈ తేల్చిన శాస్త్రజ్ఞుడు ఫ్రెడరిక్ గ్రిఫిత్. ఆయన ఆ రోజులలో సూక్ష్మజీవుల కొన్ని లక్షణములను తెలియుటకు పరిశోధనములు కొనసాగించుచుండెను. కొన్ని రకములకు చెందిన సూక్ష్మజీవులు లేక Bacteria హఠాత్తుగా ఉగ్రతను పొందుటయున్నది. అది ఏల జరుగుచున్నదని ఆయన ప్రశ్నించుకొనెను. పరిశోధనలు మొదలు పెట్టెను.ఆ పరిశోధనముల సందర్భమున నొక అద్భుతము తెలియబడినది. వాడియగు వేడి చేత నిధనము చెందించబడిన న్యూమోనియా సూక్ష్మజీవులను సజీవ సూక్ష్మజీవి సంతానముతో కలిపి వానిని ఇంజక్షనుల ద్వారమున ఎలుకలకు ఆయన ఎక్కించెను. అప్పుడు జరిగినదేమి యనగా, అంతవరకును నిరపాయములని చెప్పదగియున్న సూక్ష్మజీవు లపాయకరములును, ఉగ్రములును నైపోయినవి.ఆ తరువాత మరియొక ప్రయోగము ద్వారమునమరియొక రహస్యముకూడ ప్రదర్శింపబడినది. ఒక సూక్ష్మజీవి నిధనము చెందినది. దాని వలన రసాయన వికారమును తయారుచేసి—నిరపాయము, నిరుపద్రవమునైన ఒక సజీవ సూక్ష్మజీవికి గనుక ఇచ్చినచో, ఆ సూక్ష్మజీవి అపాయకరము, ఉపద్రవ లక్షణకము నగునని ఈ ప్రయోగము మూలమున, ప్రదర్శింపబడినది. మరియు నేమి తెలియబడినదనగా, ఈ ఉపద్రవకారి నూతన సూక్ష్మజీవి మూలమున ఆ జాడ్య లక్షణము తత్సంతానమునకు కూడ వంశపారంపర్యముగ సంక్రమించునని తెలియబడినది. ఇది ఇంతవరకు తెలియని విషయము. ఒక జీవియొక్క జీవాణువులు ఏదో ఒక అంతుపట్టని మార్గమున మరియొక జీవి జీవాణు ధాతువుల యందు చేరుట, నివిష్టము చేయబడుట జరుగుచున్నది. ఇది ఎటుల జరుగుచున్నది? దీనిని తెలియుటకప్పుడు అన్వేషణము

ప్రారంభమైనది. క్రోమోజోముల యందలి ఏభాగము మూలమున యీ పరివర్తనము జరుగుచున్నది? ఇది తెలిసినచో జీవాణు లక్షణము గూడా తెలియుటకు మార్గమేర్పడగలదని శాస్త్రజ్ఞులు భావించుచు వచ్చిరి.

1944 లో అస్వాల్డ్. టి. ఎవర్, కాలిన్ మెక్‌లాయిడ్,మాక్‌లిన్ మెకార్థీలు ఒక పరిశోధన చేసి యుండిరి.వీరున్యూయార్కులోని రాక్‌ఫెల్లర్ ఇన్‌స్టిట్యూట్ శాస్త్రజ్ఞులు.నిధనముచెందిన న్యూమోనియా సూక్ష్మజీవుల నుండి ద్రావణములు తీసి, వానిని శుద్ధిచేసి, మరియు శుద్ధిచేసి, కొన్ని ప్రయోగములు చేసి,క్రోమోజోములలో జీవాణువాహకమైన ద్రవ్యము ఒక్కటే వున్నదని,అది D N A అనితేల్చియున్నారు. చుట్టూ వున్న సర్వమైన ఇతర ద్రవ్యములను తొలగించినట్లయితే, అప్పుడు మిగిలెడి పరిశుభ్రమైన, DNAకు మాత్రమే ఒకరకమైన సూక్ష్మజీవులను మరియొక రకమైన సూక్ష్మజీవులుగా రూపాంతరము చెందించగల శక్తి యున్నదని ఇందువలన తేలిపోయినది. అవసరములైన న్యూమొకోక్సి (preumococci)లో జీవాణు ద్రవ్యమున్నట్లు స్పష్టముగా, సర్వసందేహము లకు అతీతముగా తెలియబడినది. అయితే దాని కణ సంహతి ఏమో మాత్ర మింతదనుకను అపరిజ్ఞాతముగా నుండి యున్నది. సూక్ష్మజీవి సంతానములో DNAయే వంశపారంపర్య ధర్మవహన సమర్థమునైన ద్రవ్యవిశేష మునకు ఆకరమనియును,ఇతరసూక్ష్మజీవులయందును, తుదకు మానవుని యందును నిదియే అట్టి కర్తవ్య మును నిర్వహించుచున్న ద్రవ్యవిశేషమనియును నిర్ధారణమైనది.

D N A యొక్క సంస్థాన విశేషమెట్టిదో తెలియుట కటుతరువాత మరియు పదిసంవత్సరములు పట్టియున్నది. ఈ కార్యము సాధించినవారును మరి ముగ్గురు శాస్త్రవేత్తలు. ఈపరిశోధనము ఇంగ్లండులో జరిగినది. రెండవ ప్రపంచయుద్ధము ముగిసిన అనంతరము అంతవరకును యుద్ధకాలపు భౌతిక విజ్ఞాన విశేషముల నారయుచున్న శాస్త్రవేత్త ఫ్రాన్సిస్ క్రిక్ శాస్త్రపరిశోధనమునే తన జీవితముగా స్వీకరించి కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయ ఆవరణమునందు, ఇప్పుడు ప్రసిద్ధమైన కుటీరమునందు చేరిన వాడయ్యెను. ఆయనకు తోడు శ్రీ జేమ్స్ వాట్సన్. వాట్సన్ అమెరికను. బయోకెమిస్టు. వీరిరువురును శుద్ధమైన D N A యూనిట్ల యొక్క స్వరూపమును, క్రమమును పరిశోధించుటకుపూనుకొనిరి. ఆ సమయమునకే మారిస్ విల్కిన్స్ అను శాస్త్రజ్ఞుడు కూడ మరియొక విధమున నిట్టి కృషినే చేయుచుండెను. అతని క్షేత్రము లండను నందలి కింగ్స్ కాలేజి. విల్కిన్స్ ముందు అణువిజ్ఞాన శాస్త్రమునందు కృషిచేసి యుండెను. ఇప్పుడు జీవాణువిజ్ఞాన విజిజ్ఞాసకు కడంగెను.ఈయన DNA ను స్ఫటికములవలె అగునట్లు చేసి దానియందు 'ఎక్స్—రే'లను ప్రసరింపజేసెను. ఈ ప్రసరింపజేయుట ఒక పద్ధతిలో జరిగినది. ఆ స్ఫటికములనుపోలునట్లుగా రూపొందించబడిన D N A అంచుల వెంబడియు, సందుల వెంబడియు ఆ కిరణముల కాంతిని ప్రసరింపజేసెను. అట్లు చేయుటవలన ఆ స్ఫటికముల యందు లఘువులును, గురువులునైన గీతల వంటివి, ఇంద్రధనుష్కాంతు లను చిమ్మునటువంటి వేర్పడును. విల్కిన్స్ పరిశోధన మిటువంటిది. ఇందుమూలమున నేమి తెలియుననగా ఆ D N A యందు అణువుల సంహతి ఏర్పాటు ఎట్టులున్నదియు తెలియనగును. ఇంద్రధనుష్కాంతులతోడి చిత్రములుగా నేర్పడును. దానిని ఛాయాగ్రహణముచే పట్టినచో అందలి అణుసంహతిని, ఏర్పాటును ఆ చిత్రముల ద్వారమున తెలియవచ్చును. ఇది విల్కిన్స్ పరిశోధనము. ఇప్పుడు వాట్సన్, క్రీక్‌లు విల్కిన్స్ చిత్రముల తోడను, తాము చేయుచున్న రసాయనిక పరిశోధనముల తోడను ఆ బృహత్కణము యొక్క ప్రధానమైన నిర్మాణ విశేషములకు ఒక్క ఆకారమును సమకూర్చగల్గిరి. ఇచ్చట వీరికి లైనస్ పాలింగ్‌గారి సలహాయుకూడ నున్నది. పాలింగ్‌గారు నోబుల్ బహుమానమును పొందిన రసాయనిక శాస్త్రవేత్త. ప్రోటీను యొక్క బృహత్కరణములు వ్యావర్తన క్రమమున భ్రమదాకరము కల్గియుండునని, D N A బృహత్కణముల పద్ధతి గూడ ఇట్టులనే యుండవచ్చునని ఆయన చెప్పెను. ప్రోటీనుల నిర్మాణమునకును, D N Aకును సన్నిహిత సంబంధమున్నదని ఆయన అభిప్రాయము. వాట్సన్, క్రీక్‌ల పరిశోధనమున తేలిన విషయ మింకొక్క విధముగా నున్నది. ప్రోటీనుల యందువలె, D N A యందు ఒక్క ఇట్టి నిర్మాణముగాక రెండు నిర్మాణములు, ఒకదానితోనొకటి పెనవేసుకొని నట్టివి యున్నవి. దీనిని వారు Lutwined double helix

అనియున్నారు. స్వయం ప్రజనన సమర్థమైన లక్షణమున్నియు నీ బృహత్కణమునందున్నవి. ఇట్టి విషయమును వారు ముందు ఊహచేత నిర్ధారణము చేసిరి. తరువాత ప్రయోగ పద్ధతిని అనుసరించి సాధించిరి. 1962 లో ఇందుకుగాను వారికి నోబెల్ బహుమానము లభించియున్నది. ఈ పరిశోధనము పెద్ద విషయము. ఏలన, ఒక పదార్థము యొక్క కణసంహతిని గూర్చి నిర్ధారణము చేసినప్పుడు మాత్రమే ఆ పదార్థమును గురించిన నిజమైన ఎరుక కల్గును. D N A యందలి ప్రధానమైన దారములను పోలిన ద్రవ్యవిశేషములు ఈ ఆవర్తద్వయ విశేషమునకు వెన్నుముకను పోలియున్నవి. అవియు దీర్ఘములై ఆవర్తక్రమమున గొలుసులవలె నున్నవి. వాని యందలి ద్రవ్యము Sugar – Phosphate· ఆ Sugar. Phosphate unit లు వానియం దనంతములు పౌనఃపున్యములునై యున్నవి. ఒక క్రమమున బడి మధ్యమధ్యయువి పరిసరముల యందున్న గొలుసులను పోలిన ద్రవ్యవిశేషములచే బంధితములైనవై, గ్రంథుల వలెనేర్పడిఆవర్తవిస్తృతమైన మేడమెట్ల యాకృతిని పొందియున్నవి. ఇవి యన్నియు కలిసి ఆ ఆకృతి విశేషమేర్పడినది. సంస్థానము కుదిరివచ్చినది. పరిసరముల యందున్న దారములను పోలిన ద్రవ్యవిశేషములతో ప్రధాన ఘటనా తంతువులయందేర్పడిన గ్రంథుల తోడి భాగములకు శాస్త్రజ్ఞులు "ప్రాతిపదిక భాగ" అని పేరు పెట్టిరి. ఈ 'ప్రధాన భాగలు' "తంతు భాగ"కు ఒక్క ప్రక్కను అతికింపబడినట్లున్నవై కేంద్రమునందు హైడ్రొజన్ పాశ విశేషము చేత బంధింపబడియున్నవి. ఈ ప్రాతిపదిక భాగలు నాల్గు రకములైన రసాయన మిశ్రమములలో నేదో యొకదాని వలన ఏర్పడినవై యున్నవి. ఎడినైన్ (A), థైమైన్(T),గ్వానైన్ (G సైటోసైన్ (C)—ఇవి ఆ మిశ్రణములు. మరియు నీప్రాతిపదికభాగ లానుషంగికములు. అనగా అర్థమిది. A మిశ్రణము T మిశ్రణముతోనే కలియును. G మిశ్రణము C మిశ్రణముతోనే కలియును. D N Aకు వెన్ను మాదిరిగా నమరినభాగము లేక నిర్మాణము ప్రకృతి యందంతటను జీవజగత్తునందంతటను ఏక విధముగా నుండును. రెండుగా అల్లుకొనియున్న దాని నడిమి యందంతటను ఉన్న వివిధములైన వేరువేరు ప్రాతిపదికములు లేక గ్రంథులు — ఇవి మిథునములుగా నుండును— వేరువేరుగా, జాతి జాతికి భిన్నభిన్నములైనవిగా నుండును. ఈ రకమైన వేరువేరుతనమిచ్చట దృశ్యమానమగు చున్నందు వలన వాట్సన్, క్రీక్— ఇద్దరును గూడ ఈ మిథున గ్రంథుల యందు, లేక మిథునప్రాతిపదికముల యందు ప్రాణిజాతము యొక్క సర్వరహస్యములను నావిష్కరించు కీలక మేదియో యున్నదని, యుండితీర వలయునని రాద్ధాంతమును చేసి యుండిరి.



# వ్యథిత

**శ్రీ బండి నాగరాజు**

["భల్లట శతకం"లోని 'వాతావాంతు....' అనే (101 వ) శ్లోకం ఆధారంగా—]

వెఱుపు కన్నియ ! ఏల మెరిసేవు, మురిసేవు ?
కన్నీట ఈ జగతి కాళరాత్రయి పోయె,
దీనావనను నన్ను తేపతేపకు పిలిచి,•
పతి బాసి శోకాబ్ధిబడి మున్గ ననుజూచి....

కడిమిపూరజమెల్ల గలిపి మలయానిలుడు,
వీవనీ దయలేక వెజ్జీ యుత్సాహమున....

నెమలిరాజును సుంత నెనరన్నదే లేక
నాట్యమ్ము సలుపనీ నా మ్రోల ఈ వేళ.....
క్రొన్నీరు సేవించి కోలాహలమ్ముగా
ఉరుమనీ మేఘుడును కరుణా విహీనుడై....

నా కాపురము జూచి నలిగి అలిగినవారు
గడచినామని యింత మిడిసి పడిపోయేరు:

అతివబాధలు నీకు అనుభవములోనివే
మెలతవై నీవు నిటు మెరిసేవు, మురిసేవు !

# జాతీయ గ్రంథాలయం

మనదేశంలోని పబ్లిక్ గ్రంథాలయాలన్నింటి లోకి కలకత్తాలోని జాతీయ గ్రంథాలయానికి ఎంతో గౌరవమైన స్థానమున్నది.

దేశానికి స్వాతంత్ర్యం వచ్చి నప్పటి నుంచీ ఈ గ్రంథాలయం విశేషంగా అభివృద్ధి చెందింది. 1947 లో ఈ గ్రంథాలయంలో మూడున్నర లక్షల గ్రంథాలుండేవి. ఈనాడు వాటి సంఖ్య పదమూడు లక్షలకు పెరిగింది. ఈ గ్రంథాలయం పాఠకుల సంఖ్య సగటున 25 నుంచి 960 వరకు పెరిగింది. సభ్యులకు ఇళ్లకు తీసుకు వెళ్లి చదువు కోటానికి ఇచ్చే గ్రంథాల సంఖ్య 14,291 నుంచి 78,567 కు పెరిగింది. పశ్చిమ బెంగాల్ మాజీ గవర్నరు డాక్టరు హెచ్.సి. ముఖర్జీ "భారత దేశంలో గ్రంథాలయ ఉద్యమానికి ఈ జాతీయ గ్రంథాలయం పట్టుకొమ్మ వంటిది" అని అన్నారు. లెఫ్టినెంట్ గవర్నర్లకూ, వైస్రాయిలకూ అనాడు నివాస భవనంగా ఉండే బెల్వెడిర్ భవనంలో ఈ గ్రంథాలయాన్ని నెలకొల్పారు.

## పుట్టుపూర్వోత్తరాలు

19 వ శతాబ్దం ప్రథమార్థ భాగంలో జె.హెచ్. స్టాక్లర్ మహాశయుడు కలకత్తా పబ్లిక్ గ్రంథాలయాన్ని స్థాపించారు. ఆయన "ఇంగ్లీష్ మన్" అన్న పత్రికకు సంపాదకుడు. అనధికార సంస్థగా ఆయన దానిని నెలకొల్పారు. ప్రభుత్వ కార్యదర్శికాలయ గ్రంథాలయాలను పెక్కింటిని సంలీనంచేసి 1891 లో కలకత్తాలో ఇంపీరియల్ లైబ్రరీ అన్న పేరుతో ఒక గ్రంథాలయం స్థాపించ బడింది. లార్డ్ కర్జన్ రోజులలో ఈ పబ్లిక్ గ్రంథాలయంలోని గ్రంథాలన్నింటినీ ఇంపీరియల్ లైబ్రరీకి అప్పగించారు. భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ఇంపీరియల్ లైబ్రరీ పేరును జాతీయ గ్రంథాలయంగా మార్చారు. కేంద్రంలో అప్పుడు విద్యామంత్రిగా ఉన్న మౌలానా అబుల్ కలమ్ ఆజాద్ ఈ జాతీయ గ్రంథాలయానికి ప్రారంభోత్సవం చేశారు.

## అపురూపమైన వ్రాతప్రతులు

స్వాతంత్ర్యం వచ్చినప్పటి నుంచీ ఈ జాతీయ గ్రంథాలయం యావద్దేశానికీ మార్గదర్శక మైన గ్రంథాలయంగా పురోభివృద్ధి చెందింది. 1949 లో శ్రీ అశుతోష్ ముఖర్జీ తన గ్రంథా లయంలోని వైజ్ఞానిక సాహిత్య గ్రంథా లనేకం ఈ గ్రంథాలయానికి బహుమతిగా ఇచ్చారు. అదే విధంగా అపురూపమైన అనేక ప్రచురణలు, వ్రాత ప్రతులు ఈ గ్రంథాలయానికి విరాళాలుగా లభిం చాయి. వాటిలో సర్ తేజ్ బహదూర్ సప్రూ బహూ కరించినవి ముఖ్యమైనవి.

స్వాతంత్ర్యానికి పూర్వం ప్రభుత్వశాఖలకూ, పాలకోద్యోగుల అవసరాలు తీర్చడానికి మాత్రమే ఉద్దేశించబడిన ఈ గ్రంథాలయం ఈనాడు బహు ముఖ సేవా సంస్థగా అభివృద్ధి చెంది, జాతీయ గ్రంథాలయమన్న పేరును సార్థక పరుచుకున్నది. చారిత్రక ప్రాముఖ్యంగల ప్రధానమైన వ్రాత ప్రతులకు మైక్రోఫిల్మ్ ప్రతులను తయారుచేసి పదిల పరచటానికి ఈ గ్రంథాలయం వినూత్న కార్యక్రమాన్ని ప్రారంభించింది. ప్రాచీన పండితులు, భావుకులయొక్క విలువైన భావాలతో నిక్షిప్తమై వున్న ఈ వ్రాత ప్రతులు చెడిపోకుండా దీర్ఘకాలం భద్రపరచడానికి ఈ కార్యక్రమాన్ని చేపట్టారు. ప్రపంచ విజ్ఞాన సంస్థ ఇందు కవసరమైన పరి కరాలనూ, ప్రవీణులనూ సమకూర్చింది. ప్రస్తుతం ఈ గ్రంథాలయంలో వ్రాత ప్రతులకు మైక్రోఫిల్మ్ ప్రతులను తయారు చేస్తున్న ప్రపంచ విజ్ఞాన

సంస్థ ప్రవీణులు దేశంలోని అనేక గ్రంథాలయాలను దర్శించ నున్నారు. సంస్కృతం, అరబ్బీ, పరిషియన్ భాషలతో సహా అనేక భాషలలో మూడు లక్షల వ్రాతప్రతులకు మైక్రోఫిల్మ ప్రతులను తయారు చేయడానికి సంకల్పించబడింది. ఒక్కొక్క వ్రాత ప్రతికి రెండేసి మైక్రోఫిల్ములు తయారుచేసి, రెండు వేరు వేరు గ్రంథాలయాలలో వుంచుతారు. పరిశోధనలు జరిపే పండితులు వాటిని వినియోగించుకో వచ్చును. కొన్ని ముఖ్యమైన ప్రతులు నామమాత్రపు ధరకు విక్రయిస్తారు. పండితులు, పాఠకుల కోర్కెపై గ్రంథాల జాబితాలను తయారు చేయటంతోపాటు నరజాతి శాస్త్రం, వృక్ష శాస్త్రం, బెంగాలీ సాహిత్యాలకు సంబంధించిన గ్రంథాల జాబితాలను కూడా ఈ గ్రంథాలయం తయారు చేస్తున్నది. ఈ గ్రంథాలయం గ్రంథ ప్రదర్శనాలనూ, ముద్రణారీతులను వివరించే ప్రదర్శనాలనూ నిర్వహించింది. నిరుడు అషుతోష్ ముఖోపాధ్యాయ శతజయంత్యుత్సవాల సందర్భంలోనూ, ఈ సంవత్సరం మే లో రామానుజ చటర్జీ శతజయంత్యుత్సవాల సందర్భంలోనూ ఇట్టి ప్రదర్శనం నిర్వహించింది.

## బాలల గ్రంథాలయం

జాతీయ గ్రంథాలయంలో 1960 జనవరిలో బాల గ్రంథాలయశాఖ ఏర్పాటు చేయబడింది. బెంగాలీ, ఆంగ్లం, హిందీ, గుజరాతీ, మరాఠీ, తమిళం, ఉరుద్దు, రష్యన్, ఫ్రెంచి భాషలలోని 13 వేల ఇట్టి సాహిత్య గ్రంథాలు ఇప్పటు చేర్చబడినాయి. ఇతర భాషలలోని బాల సాహిత్య గ్రంథాలను సేకరించడానికి కృషి జరుగుతోంది. పబ్లిక్ గ్రంథాలయాలకు గ్రంథాల బట్వాడా చట్టం మేరకు దేశంలోని ప్రతి ప్రచురణ కర్త తాను ప్రచురించిన గ్రంథమూ లేక పత్రికల తాలూకు ఒక్కొక్క ప్రతిని జాతీయ గ్రంథాలయానికీ, దేశంలోని మరో మూడు పబ్లిక్ గ్రంథాలయాలకూ విధిగా పంపాలి.



# ఈనాటి సాహిత్యంలో స్థితిగతులు

ఆర్యా,

జూన్ (1966) నెల భారతిలో "ఈనాటి సాహిత్యంలో స్థితిగతులు" అన్న వ్యాసం మీద టి. ఎల్. కాంతారావుగారు ఆగస్టు నెల భారతిలో వ్రాసిన లేఖను చూచాను.

సాహిత్య విమర్శ వ్యాసాల మీద పాఠకులు వ్రాయడం సంతోషించవలసిన విషయమే. కాంతారావు గారు మాత్రం కొంత 'అసహనాన్ని', ఆవేశాన్ని ప్రదర్శించారు. విపులీకరిస్తాను. అభ్యుదయకవిత్వాన్ని గురించి వ్రాస్తూ "పాశ్చాత్యదేశాల్లో ప్రచారంలో ఉన్న అభ్యుదయ సిద్ధాంతాలు శ్రీశ్రీ గారి కవిత్వంలో ప్రతిఫలించడంలేదు" అని నేను వ్రాశాను. దానికి జవాబుగా కాంతారావుగారు ఇట్లా వ్రాశారు. "అంటే విమర్శకుడికి ఏది అభ్యుదయంగా కనబడుతుందో, అదే భావం కవికి గూడా ఉండాలని వీరి అభిప్రాయం కావచ్చు. సాహిత్యంలో సాధారణంగా జరుగుతున్న చరిత్ర ఏమిటంటే విమర్శకులు వారి ప్రమాణాలతో కవిని కొలవడం. దానివల్ల విమర్శనారంగంలో ఇన్ని అనర్థాలు ఏర్పడుతున్నాయి. వ్యాసకర్త చెప్పినట్లుగానే చూస్తే ప్లేటో నిర్మించిన (Kepublic) శాస్త్రీయాభ్యుదయానికి ఉదాహరణగా కన్పడుతోంది. పోతే శాస్త్రీయాభ్యుదయమంటే ఏమిటో వ్యాసకర్త, ఎక్కడా చెప్పినట్లు కనబడలేదు. అసలీ "అభ్యుదయం" అనే మాటకి చాలమంది చాల రకాలుగా అర్థాలు తీస్తున్నారు కాబట్టి అభ్యుదయాని కర్థం వివాద గ్రస్తంగానే మిగిలిపోయింది. ప్లేటో నిర్మించిన (Kepublic) వ్యాసకర్తకి ఆచరణీయమైనఅభ్యుదయ భావం కావచ్చు. Marx నిర్మించిన వర్గరహితసమాజం సమతావాదం శ్రీశ్రీకి అభ్యుదయంగా కనబడవచ్చు."

ఈ పై మాటలు చూస్తే కాంతారావుగారు నా వ్యాసాలను పరిశీలన చేసినట్లే కనపడదు. తన అభిమాన—ఇష్ట—కవులను తమకు అభిలషణీయమైనంత ఎక్కువగా పొగడలేదని ఆవేశంతో వ్రాయడమే జరిగింది. నా వ్యాసాలలో పై ప్రశ్నలకు సమాధానాలున్నాయి చూడండి.

"ఐరోపాలో పారిశ్రామిక విప్లవము (Industrial revolution ఒకస్థాయికి వచ్చిన తరువాత మేధావులంపైన మార్క్సిజం (Marxism) ప్రభావము కనపడుతూ వచ్చింది. ఆ ప్రభావమే సర్వసాహిత్య ప్రక్రియలలోను, అనుకూల్య ప్రాతికూల్య స్పర్థలో విద్యమానం అయింది. మార్క్సిస్టు సిద్ధాంతాలలో, లక్ష్యాలలో సాహిత్యవాదులు రచనలు చేసి అభ్యుదయ సాహిత్యాన్ని నిర్మించారు. పాశ్చాత్యదేశాలలో అభ్యుదయ రచయితలకు మానవాభ్యుదయము, వర్గరహిత సమాజము, విశ్వశాంతి, భవిష్యత్‌పై విశ్వాసము, ఇవి ముఖ్యలక్ష్యాలు. "విశ్వశ్రేయః కావ్యమ్" అను మన ప్రాచీన లాక్షణికుల సూత్రమునకు యీ నూతన అభ్యుదయ కవితావాద లక్ష్యాలు విపులార్థ స్ఫురణములే నని చెప్పవచ్చును.

ఈ అభ్యుదయ రచయితల వర్గమునకు చెందిన ప్రముఖ కవులలో మాయకొవిస్కి, నాజిం హిక్‌మత్, పాబ్లోనెరూడా, ఆడెన్, స్పెండర్, చెప్పుకో తగినవారు. ఈ అభ్యుదయ వాదమును పూర్తిగా అవగాహన చేసుకోవాలంటే, కారల్ మార్క్స ప్రతిపాదించిన సామ్యసిద్ధాంతములను, కారల్ మార్క్సపై కొంతవరకు ప్రభావము చూపెట్టిన డేవిడ్ రికార్డో ఆర్థికగతి సిద్ధాంతములను, హెగెల్ (Hegal) ఫిక్టే (Fichte) మొదలగు తాత్త్వికుల సిద్ధాంతములను పరిశీలించవలసి ఉంటుంది. మరిన్ని శాస్త్రీయమైన అభ్యుదయ వాదాన్ని వివరింపవలసి వస్తే, మూర్ వ్రాసిన యుటోపియ (Utopia) ప్లేటో (Plato) ఊహాగానాలతో నిర్మించిన రిపబ్లిక్(Republic) వెల్జ రచించిన"కొత్తప్రపంచాలు"(New Worlds)చూడక తప్పదు. ఈ సిద్ధాంతాన్ని సాహిత్యప్రక్రియగా రూపొందించడం ఎట్లా అని ప్రశ్నవస్తే ఫాబియన్ (Fabian) విధాన సామాజికవాదులు నిర్మించిన సాహిత్యాన్ని

చదవటంవల్లకూడా మేలే కలుగుతుంది. బెర్నార్డ్‌షా, వెల్స్, మొదలగు మేధావులు ఈ శాఖకు చెందినవారే. వీళ్లకు "పడకకుర్చీ సామాజిక" వాదులనే పేరు (Nick name) కూడా ఉన్నది. ఈ అభ్యుదయవాదులు భారతములో చెప్పిన "దుఃఖాదుద్విజితే సర్వ స్సర్వ స్యసుఖమీప్సితం" (అనగా దుఃఖము అందరకు కష్టమైనదే. సుఖమును అందరును కోరుదురు.) అన్న భావమునకు సన్నిహితులుగా నున్నారని చెప్పవచ్చును" (పుటలు 39, 40 డిసెంబరు 1965 భారతి.)

నేను వ్రాసిన పై వాక్యాలమూలమున "అభ్యుదయ వాదము" అంటే ఏమిటో నేను శక్తివంచన లేకుండా పరిశీలించినట్లు అంగీకరింపవలసి ఉంటుంది.

నేను ఇంత వ్రాసినా—"నువ్వు శాస్త్రీయ అభ్యుదయవాదం అంటే ఏమిటో చెప్పలేదు—అది నీకు తెలియదు—మార్క్స్ నీకు తెలియనివి ఏవో చెప్పాడు. అవి మాకు తెలుసు. నువ్వు నీ కొలబద్దతో కొలుస్తున్నావు" అని విమర్శకు దిగితే—అట్టివారితో సాహిత్య వివాదమే లేదు. ఇంతకూ నా మనవి ఏమంటే పైన వివరింపబడిన "అభ్యుదయ సాహిత్య సిద్ధాంత భావాలే"— యావత్ప్రపంచ సాహిత్యవేత్తలు అంగీకరిస్తున్నారు. కాంతారావుగారికి ఆ సిద్ధాంతాలు సమ్మతం కాకపోతే నేను చెయ్యగలిగినదేమీ లేదు.

పై కొలబద్దతో కొలిస్తేనే శ్రీశ్రీగారి కవిత్వంలో అభ్యుదయ సిద్ధాంతాలు ప్రతిఫలించడం లేదు. "వయస్సు మళ్ళిన వారిని చావమని శపించడం"— Marx నిర్మించిన వర్గరహిత సమాజం, సమతావాదం—వంటి వాటిని ప్రతిఫలించదు. ఎవరినో సమిథ చేసి ఆహుతి ఇచ్చి, తాను పల్లవించడం స్వార్థపరత్వమే గాని అభ్యుదయంకాదు.

ఇంతకూ నేను శ్రీశ్రీని తక్కువరకం కవిగా చెప్పలేదు. అతనికి శాశ్వతమైన కీర్తి ఉన్నదన్నాను. అతడు శృంగార విశృంఖలత్వాన్ని సాధించి భావప్రధానమైన కవిత్వాన్ని వ్రాశాడన్నాను. కాకపోతే శ్రీశ్రీ కవిత్వంలో అభ్యుదయ సిద్ధాంతాల కంటే భావప్రధానమైన రచనావిధానం ఎక్కువగా ఉండటంవల్ల ఆయన్ను నేను ముందుకు తోశాను. ఇందుకు ఆగ్రహం అక్కర లేదు.

"బలవంతులు దుర్బల జాతిని బానిసలను కావించారు. నరహంతలు ధరాధిపతులై చరిత్రమున ప్రసిద్ధి కెక్కారు. కాలం గడుస్తున్న కొద్దీ మానవుడు చీకటి నుంచి వెలుగులోకి రావడానికి ప్రయత్నిస్తున్నాడు. వ్యక్తి, వ్యక్తి చుట్టూ ఉన్న సాంఘిక వ్యవస్థ, దానికున్న చరిత్ర ఈనాటి మానవుడు సమగ్రంగా అర్థం చేసుకోగలుగుతున్నాడు. రాచరికపు వ్యవస్థలోంచి ప్రజాస్వామికంలోకి అడుగు పెట్టిన మనిషి వ్యక్తిస్వాతంత్ర్యం అంటే ఏమిటో అర్థం చేసుకోగలుగుతున్నాడు. అందుకే ఒక వ్యక్తిని మరొక వ్యక్తి—ఒకజాతిని వేరొక జాతి పీడించే సాంఘిక ధర్మం, ఇంకానా ఇకపై సాగదు'—అంటున్నాడు ఈనాటి అభ్యుదయకవి"— అంటూ ఇదంతా శ్రీశ్రీ సంగతని కాంతారావుగారి వాక్యాలు.

సిద్ధాంతాలు నినాదస్వరూపంగాకాకుండా, చర్చాస్వరూపంగాకాకుండా సాహిత్యంలో మలచబడితే, ఉత్తమ సాహిత్యం అవుతుందని సాహిత్య భావుకులకు తెలిసిన విషయము. పై మాటలేకాదు—ఇంకా, ఎక్కువ సిద్ధాంత ప్రవచనం చేసినా అది సాహిత్యం కాదు. మేము ఇన్ని మాటలు వ్రాశాము, ఉపన్యసించాము, వివాదాలు చేశాము-అభ్యుదయాన్నిగురించి—అదంతా సాహిత్యమే అంటే చాలా కష్టం వస్తుంది. సిద్ధాంత ప్రవచనాలు—ఉపన్యాసాలు ఒకయెత్తు. వాటిని మనోహరంగా మలచిన సాహిత్యం ఇంకో ఎత్తు. నేను వ్రాసింది సాహిత్యాన్ని గురించి. కాంతారావుగారు సిద్ధాంతాలను వివరించారు. అది ప్రస్తుతాంశంకాదు. శ్రీశ్రీగారి అభ్యుదయ భావాల మీద తెలుగుదేశంలో ఎటువంటి అభిప్రాయాలు ఉన్నాయో, ఒక ఉదాహరణ ఇస్తాను. 1954—55 సం.లో ఆంధ్రలో జరిగిన మధ్యంతర ఎన్నికల సందర్భంలో—ఒక పెద్ద తుపాను లేచింది. దేశంలో నలుమూలల నుంచీ రచయితలూ—భావుకులు సంతకాలు చేసి శ్రీశ్రీని పరోక్షంగా ఖండిస్తూ పత్రికలలో వ్రాశారు.

శ్రీశ్రీ అనుయాయుల రచనలు వట్టి శాబ్దిక అయోమయంగా ఉన్నాయని నేను అన్నాను. దానికి కాంతారావుగారు "ఇది కేవలం ఆధారరహితమైన నిందారోపణ. ఒకవేళ ఉదాహరణగా ఏ ఒకటో రెండో ఎవరివో చూపించినప్పటికీ తక్కిన కవిత్వం అంతా ఇంతే అనుకోవడం హాస్యాస్పదం కాదా? ఛందోబద్ధ

కవిత్వం అంతా కవిత్వమేనా? దాంట్లో మాత్రం ఎన్ని అపకావ్యాలు లేవు గనుక. అయితే వీళ్లంతా వ్యాకరణ సిద్ధాంతాల్నీ, ఛందో నియమాల్నీ, గ్రాంథికభాషనీ, ఉపయోగించుకున్నారు కాబట్టి లోపం లేదనుకుంటే అది పాక్షికతయే కాగలదు. సాహిత్యం మహాసముద్ర మైతే అందులో రాళ్లూ, రత్నాలూ, రెండూ ఉంటాయి. అవి యిదివరకూ ఉన్నాయి. ఇప్పుడుఉన్నాయి. ఎప్పుడూ ఉంటాయి. ఏది పరిగ్రహించాలో, ఏది విసర్జించాలో బుద్ధి జీవులు నిర్ణయించుకోవాలి. ఈనాటి కవిత్వంలో అభ్యుదయంలేదు అని ఒక మాటంటే సరిపోతుందా?'' అని కాంతారావుగారి వాక్యాలు.

నేను ఛందోబద్ధ కవిత్వ పక్షపాతినికాదు. అందు లోనే కవిత్వం ఉంటుందని గాని వాళ్లు వ్యాకరణ సిద్ధాంతాల్నీ, ఛందోనియమాల్నీ గ్రాంథికభాషను ఉప యోగించుకున్నారు కాబట్టి లోపం లేదనుకోమని నేను వ్రాయులేదు. అవి నా అభిప్రాయాలు కానేకావు. అసందర్భమైన ఉటంకింపులు వ్రాసి అపగసోపేశాలకు లోనుకావడం బుద్ధిజీవులు చేసేపనికాదు. నేను వ్రాసిన వ్యాసంలో సాహిత్యంలో ప్రాదుర్భవించిన Trends ను గురించి వ్రాశాను. ప్రతి ఒక్క కవిని గురించి వివరంగా వ్రాయుడానికి వ్యాసం యొక్క పరిధిలో సావకాశం లేదు. ఈనాటి నవకవుల శాబ్దిక అయోమయత్వం ఎట్లా ఉంటుందో శ్రీ ఎస్. గోపీగారు ఆగస్టు నెల భారతిలోనే (పుట 72) పెద్దపట్టే కట్టి చూపించారు. ఈ శబ్ద అయోమయత్వానికి దానిని చూచి కాంతా రావుగారు తృప్తి కలిగించుకోవాలి. నేను కూడా రెండు ఉదాహరణలు 'శ్రీశ్రీ' రచనలలోనే చూపుతున్నాను. (1) భిక్షువర్షీయసి. దీని అర్థం ఏమిటో-మన ఇష్టం వచ్చినట్లు ఊహించుకుంటంకాదు— ఇదమిత్థమని, నిర్ణయించడం కష్టమే. ఇది మామూలు తెలుగు పదబంధంకాదు. సంస్కృత రూపం తగిలించుకుని కన్పడుతున్నది. భాష్యంతవైయాకరణులకు కూడా ఈశబ్దం దొరుకుడుపడదు. ఎవరికీకూడా అర్థంకాని— అర్థాన్ని సాధించడానికి-వీలుకాని-అదికూడా క్లిష్టతర మైన సంస్కృత భాషాబంధాల్ని వాడటం శబ్ద సౌలభ్యమా? అభ్యుదయమా? ఇటువంటివి శ్రీశ్రీ రచనలలోనే ఇంకా కొన్ని చూపించవచ్చును.

మనభాషలో 'నుడి నానుడి' ఉన్నాయి. శబ్దా లకు రూఢి అర్థాలు ఏర్పడి ఉన్నాయి. 'మరో లోకం-మరో ప్రపంచం' అంటే-మనభాషలో-'పరలోకం'— మరణించిన వారు పోయే లోకం అనే రూఢి అర్థం ఉన్నది. నువ్వు నీఇష్టం వచ్చిన శైలి, రచనావిధానం ఎన్నుకో—నీ ఇష్టంవచ్చిన సిద్ధాంతాలు ప్రతిపాదించు. కాని ఉపయోగించే భాషలో లేని అర్థాలతో శబ్దాలు ప్రయోగించి దబాయించి ప్రయోజనం ఉండదు. 'పరలోకం' అనే రూఢి అర్థంగల ''మరో ప్రపంచం పిలిచింది'' అంటే మృత్యువు ఆసన్నమైనదని రూఢి భావము. ఇందుకు ఎంతవిరుద్ధంగా 'మరో ప్రపంచం'లో ఉన్నది! వివరణం అవసరంలేదు.

కొన్ని గీతాలు ఇచ్చి అవి అభ్యుదయ గీతాలు అవునా కాదా అని కాంతారావుగారు సవాలు చేస్తున్నారు. కాంతారావుగారు అంగీకరించినట్లుగా ఈసంగతి ఒకటి రెండు గీతాలతో తేలేదికాదు. అభ్యుదయ మార్గంలో నిలువ్రతొక్కుకున్న మహాకావ్యాలు రావాలి.అది సాహిత్య భావుకుల కందరికీ సంతోషం కలిగించే విషయం. (''ముక్తకే కవయోఽనంతాః, సంఘాతేకవయశ్శతం, మహాప్రబంధేతు కవిరేకో, ద్వౌ, దుర్లభాస్త్రయః''.)

కాంతారావుగారి ఇంకో సవాలు : ''ఆరుద్ర, దాశరథి, కుందుర్తి మొదలైన కవులు శాబ్దికమైన అధికారాన్ని, అనేకమంది సాంప్రదాయిక కవులకన్నా ఎక్కువగా కలిగినవారే''. ఇటువంటి వ్యక్తిగతమైన పాండిత్య పరిశీలనకు దిగటం బాధాకరంగా ఉంటుంది. దాశరథిగారి సాంప్రదాయిక కవిత్వం ముందు ఆయన వ్రాసిన సంప్రదాయేతర కవిత్వం నిలువదని ఇదివరకే 'జయంతి'లో చదివినట్లు జ్ఞాపకం. ఆరుద్రగారి శాబ్దిక అధికారాన్ని గురించి పూజ్యులు శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు ఈమధ్య భారతిలో సమగ్ర ఆంధ్ర సాహిత్య విమర్శలో పదే పదే వ్రాశారు. 'దస్త్రగిరి' 'వాపిగుజ్జ' వంటివి సాహిత్యగోష్ఠులలో హసింపబడి ప్రసిద్ధమైనాయి.. మళ్లీ నేను వ్రాయడం పునరుక్తి అవుతుంది. మిత్రులు శ్రీ కుందుర్తిగారికి స్వయంగా అభ్యుదయ కవిత్వం మీద ఉన్న అభిప్రాయం కాంతా రావుగారికి తెలిసినట్లులేదు. శ్రీ కుందుర్తిగారి మాటలు ఇట్లా ఉన్నాయి : ''కావ్యవస్తువులో స్పష్టత లేక, ఊహలో సౌందర్యం లేక,కవి యిస్తున్న సందేశం

అసలులేక యిటీవల ఆధునిక కవిత బాగా దెబ్బ తిన్నట్లు నాకు అన్పిస్తున్నది.. రచయితల్లో స్తబ్ధత ఏర్పడింది.....భావకవిత్వం, అభ్యుదయ కవిత్వం, వచన కవిత్వం,ఎన్నిమార్పులు వచ్చినా, ప్రేమ కవులు పెట్టిన భిక్ష ఆత్మాశ్రయ కవితామార్గం యింకా మనలను వీడిపోలేదు. ఇది ఉన్నన్నాళ్ళు మన కవిత్వం యిలానే ఎదుగుబొదుగులేకుండా ఉండకతప్పదు.... అభ్యుదయ ఉద్యమం విజృంభించిన రోజుల్లో ఆదర్శ మనే దానికి అధికప్రాధాన్యం వచ్చి, కవిత్వపు విలువలను నిర్లక్ష్యం చేయుడం జరిగింది. కనుకనే ఆ ఉద్యమం అంత త్వరగా చల్లారిపోయి కవిత్వపు విలువలకు ప్రాధాన్యం గల ఆధునిక వచన గేయోద్యమం ఆరంభ మైనది." (పుట 84-భారతి-డిశంబరు, 1965.)

ఈ పైమాటలను బట్టి అభ్యుదయ కవిత్వం చల్లారిపోయినదనీ, అందులో కవిత్వపు విలువలు లేవని శ్రీ కుందుర్తిగారు నిస్సంకోచంగా తేల్చి చెప్పినారు. కాంతా రావు గారి దృష్టిలో అభ్యుదయ కవులైన శ్రీ కుందుర్తిగారిమాటలు కాంతారావుగారు శిరసావహించక తప్పదు.

కాంతారావుగారు ఈనాటి విమర్శకులను గురించి శ్రీశ్రీ అన్నమాటలు ఉటంకించి ఇంకో సవాలు చేశారు. "ఆధునిక కవిత్వం నియమరహితమైనదనే శుష్కవాదన సహృదయులైన విమర్శకులది కాదు... తమ ప్రామాణ్యాలకు లొంగనంతమాత్రంచేత, విమర్శకు కాదు, నిరసనకీ—దూషణకీ పూనుకొంటున్న చిత్ర మనస్కులు" "ఈనాటి సాహిత్య విమర్శకులలో కొంద రున్నారు. అందుకనే విమర్శయొక్క స్థాయి పడి పోయింది"—ఇది కాంతరావుగారి ఆవేదన. నిజానికి శ్రీశ్రీగారి విమర్శకులమీదవిసుర్లు పట్టించు కోవలసినవి కావు. ఎంచేతనంటే ఆధునిక కవిత్వం నియమరహితమైనదని నేను వాదించలేదు. కాకపోతే ఆ సిద్ధాంతాలు బాగా మలచి, ప్రతిఫలించే టట్లుగా రచనలు ఇంకారావాలి అంటున్నాను. అభ్యు దయ కవిగా కాంతారావుగారు ఎన్నుకున్న శ్రీ కుందుర్తి కూడా ఇంచుమించు నా భావాలే అంటున్నారు. ఈ సందర్భంలో శ్రీశ్రీగారి మాటలు తీసుకురావడానికి సందర్భశుద్ధి కనపడటం లేదు.

కాంతారావుగారి ఇంకో విసురు — నవలలను గురించి నేను వ్రాసిన దానిపైన. ఉత్తమస్థాయి నవలలు మూడోతరంవాళ్ళు వ్రాయలేదని నేను వ్రాసిన దానికి స్పర్థిగా ఆయన కొన్ని పేర్లు చెబుతున్నారు. బుచ్చిబాబుగారి 'చివరకు మిగిలేది' అందులో ఒకటి. ఈ పుస్తకాన్ని గురించి ఉత్తమ భావనా వైచిత్రి ఉన్నదని నేను వ్రాశాను. గమనించకుండా అక్కసుపడితే నేను చెయ్యగలిగినది లేదు. గోపీచంద్‌గారిని గురించి కూడా వ్రాశాను. దీర్ఘకాలంలో వచ్చిన సాహిత్య తరంగ ముల (Trends) ను గురించి సమీక్షించుటలో "ఫలానా పుస్తకాన్ని గురించి ఎందుకు వ్రాయలేద"ని సవాలు చేయుటలో సామంజస్యము లేదు. నవలలలో వినోదాన్ని (Entertainment) కలిగించేవి చాలా ఉన్నాయి. కాంతారావుగారు చెప్పినవన్నీ అట్టివే. కాని కాలాబాధ్యమైన సాహిత్యం (Literature) గా కావ్యను చేరుకున్నవి ఎంచవలసి వస్తే వెనుకంజ వెయ్యవలసి వస్తుంది. 'వేయి పడగలు,' 'మాలపల్లె', 'ఏకవీర' చదువుకున్నట్లు మళ్ళీ మళ్ళీ చదువ తగిన నవలలు మూడో తరంలో ఇంకా రాలేదని నిస్సందేహంగా చెప్ప వచ్చును. వినోదానికి (Entertainment), సాహిత్యానికి (Literature) తేడాలు ఏమీలేవనే భావాలు కలవారు కూడా ఉండవచ్చును. ఉత్తమ నవలా సాహిత్యం వస్తే నాకూ సంతోషమే. ఇంతకంటే నిశితంగా వ్రాస్తే కాంతారావుగారు ఉదహరించిన గ్రంథకర్తలకు బాధ కలిగించడం అవుతుంది. అది నాకు సమ్మతం కాదు. కాంతారావుగారి ధోరణి ఎంత అసందర్భంగా ఉన్నదో ఇంకో ఉదాహరణ చూపిస్తాను. "...ఈ నవల లన్నీ ఈ విమర్శకుల దృష్టికి ఎందుకు ఆనడంలేదు అంటే నా కొక్కటే సమాధానం తోస్తోంది. ఈ నవలలు గ్రాంథికానికి దగ్గరగా ఉన్న వ్యావహారికంలో వ్రాయబడలేదు..." ఇవి కాంతారావుగారి మాటలు. నిజానికి కాంతారావుగారు ఉదహరించిన నవలలన్నీ అటువంటి భాషలో ఉన్నవే.

శ్రీ కొడవటిగంటి వారిని గురించి నేను "ఆయన రచనల్లో హార్మోనియం సంగీతం లాగా కొంత చర్విత చర్వణం కన్పిస్తుంది" అన్నాను. దానికి కాంతారావు గారు విసురులు విసరి హార్మోనియాన్ని పేర్కొనడంలో ఔచిత్యం లేదన్నారు. కొడవటిగంటి వారి రచనలలో చర్విత చర్వణంలేదు అన్నారు. కాంతారావుగారి వాదన

పిడివాదనగా ఉన్నది. ఫిబ్రవరి (1966) భారతిలో మిత్రులు శ్రీ కె. వి. రమణారెడ్డిగారు బహుదీర్ఘమైన సమున్నతమైన పరిశీలనా వ్యాసం వ్రాశారు. (పుటలు 11 నుంచి 33 వరకు). అందులో శ్రీ కొడవటిగంటి నవలలను గురించిన అతి నిశిత పరిశీలన జరిగింది. శ్రీ రమణారెడ్డిగారు కూడా చివరకు కొడవటిగంటి గారి రచనలలో వైవిధ్యం తక్కువనీ, కొంతవరకు చర్విత చర్వణం ఉన్నదనీ తేల్చి చూపించారు. దీర్ఘమై నిశిత పరిశీలనా రూపమైన శ్రీ రెడ్డిగారి విమర్శకు కాంతారావుగారు సమాధానం చెప్పుకోగలిగిన తర్వాత గాని—నేను వ్రాసిన చర్వితచర్వణాన్ని ఆక్షేపించదగిన సందర్భం ప్రభవించదు. ఇక హార్మోనియం గురించి— గాత్రంతో ప్రక్కవాద్యంగా హార్మోనియం ఉన్నప్పుడు గాత్రంలోని సొగసులు ప్రస్ఫుటం కావడానికి ఆ వాయిద్యం అడ్డుపడుతూ ఉంటుందని శ్రుతిమర్మజ్ఞులు గ్రహించిన విషయం. వైవిధ్యంలేని కథావస్తువు తీసుకున్నందువల్ల శ్రీ కొడవటిగంటి వారి కల్పనా చాతుర్యం కొంత దెబ్బ తిన్నది. హార్మోనియాన్ని గురించి ఇంకా కావలసి వస్తే—ఆలిండియా రేడియో వారిని అడిగితే తెలుస్తుంది. దాన్నిగురించి వివాదం ఇక్కడ ప్రసక్తం కాదు.

కాంతారావుగారు తను లేఖ ముగింపులో చాలా ఆగ్రహం పడ్డారు— "ఏమైనా, తెలుగుదేశంలో ఒక దురలవాటు ఉన్నది. ఎవరికివారు మేమే అధికారులమని భావిస్తున్నారు"- ఈ మాటలు కాంతారావుగారికి కూడా అన్వయిస్తాయి. కుందుర్తివారి అభిప్రాయాలు చూస్తే—శ్రీ రెడ్డిగారి వ్యాసం చూస్తే—కాంతారావు గారు ఎంత తొందరపడ్డారో, లేని అధికారాన్ని ఎట్లా స్వీకరించారో తెలుస్తుంది. శ్రీ కుందుర్తి అభ్యుదయ కవిత్వం మీద అన్నమాటలు ఎక్కువ అధికారం కలిగి అన్నమాటలే. శ్రీ రెడ్డిగారు కొడవటిగంటి వారి మీద వ్రాసిన వ్యాసం తెలుగువారి సాహిత్యభావుకతకు వెలుగుబాటలు దిద్దిన వ్యాసము. శ్రీ రెడ్డిగారు కొడవటిగంటి వారికి మిత్రులే. వీరందరికీ లేని అధికారం కాంతారావుగారికి ఎక్కడనుంచి వస్తుంది?

కాంతారావుగారి మాటలు ఇంకా ఇట్లా ఉన్నాయి : "సౌందరనందం కావ్యం కాదన్నారు. గురజాడను అకవి అన్నారు. కన్యాశుల్కాన్ని, మహా ప్రస్థానాన్ని వెక్కి పుస్తకాలతో పోల్చారు. (ఈ విషయం ఉదహరించడానికి చాలా సిగ్గుపడుతున్నాను. కాని తప్పదు.) చివరకి ఈనాటి సాహిత్యమంతా అగమ్య గోచరమని తేల్చారు... స్నేహము, ప్రేమ అనే రెండు వెలుగులను నరుని మీద తిప్పి కాంచితే వింతసొగసులు బయలుదేరుతవి. అసూయ అనే అంధకారంలో అంతా ఏకనలుపే." నా రచన మీద ఈ ముగింపు వాక్యాలతో విమర్శ చెయ్యడంవల్ల ముగింపు వాక్యాలలో ఈసడింపబడిన కార్యాలన్నీ నేనే చేసినట్లుగా పాఠకులకు భ్రమ కలిగించే ధోరణిలో కాంతారావు గారు వ్రాశారు. వారు వ్రాసిన దానికి సిగ్గుపడవలసిన అవసరం నిజంగానే ఉన్నది. ఎంచేతనంటే వారు వ్రాసిన పై మాటలకూ - నా వ్యాసానికీ ఏమీ సంబంధంలేదు. కాంతారావుగారు పై మాటలు వ్రాయడానికి నా వ్యాసంలో ఆస్కారం లేనే లేదు. ఐతే ఆయన అంగీకరించినట్లు అసూయ అనే అంధకారం కారణం అయివుండవచ్చును. సౌందరనందం కావ్యం కాదని నేను ఎప్పుడూ వ్రాయలేదు. అట్లా వ్రాసినవారెవరైనా ఉంటే వారితో నాకు అభిప్రాయభేదం ఉన్నది. ఈ విషయం సాహిత్య వీథులలో ప్రముఖులకందరికీ తెలుసును. గురజాడను అకవి అని నేను అనలేదు. శ్రీ గురజాడను గురించి కన్యాశుల్కాన్ని గురించి జనేవరు 1966 భారతిలో నేను ప్రశంసిస్తూ వ్రాశాను. అసూయాభారంతో కన్నులు మూసుకుని దూషించేవాళ్లకు సమాధానాలు చెప్పడం కూడా నిజానికి అనవసరమే.

తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు.

## చందుపట్ల శాసనము

ఆర్యా!

హైదరాబాదు నుండి విజయవాడకు వెళ్లు రోడ్డుపై 'నకరెకల్లు' అను గ్రామము గలదు. ఆ గ్రామమునకు దాదాపు రెండుమైళ్ల దూరమున 'చందుపట్ల' యను ఒక పెద్ద గ్రామము గలదు. ఇచట అనేకములగు పురాతన దేవాలయములు, శిల్పములు గలవు. ఈ గ్రామము విద్యావంతులకును, ధనధాన్యములకును, జనాభాకును ప్రసిద్ధి వహించినది. ఇది నల్లగొండజిల్లా, నల్లగొండతాలూకా, నకరెకల్లు బ్లాకునకు చెందిన గ్రామము. ఇట్టి యూరునకు

పడమటి భాగమున అనగా నకరెకల్లు నుండి నల్లగొండకు వెళ్లు రోడ్డునకు సమీపమున 'పెద్ద ముత్యాలమ్మ గుళ్లు' అనుపేరున పిలువబడు కొన్ని చిన్న దేవ్యాలయములు గలవు. ఆ యాలయము లకు ముందు భాగమున (దక్షిణపు వైపు) చతు రస్రాకారము గల ఒక శిలా స్తంభముపై ఒక శాసనము చెక్కబడి యున్నది. వ్రాత యందముగను, పరిశుభ్రముగను మూడు వైపుల చెక్కబడి యున్నది. ఇట్టి దీనిని పరిశోధించి ప్రకటింప వలయునను తలంపు కలిగిన వాడనై కొంత శ్రమించితిని. కాని శాసనము దీయుపద్ధతియు, మొదలగునవి తెలియక తత్ప్రయత్నము నుండి నేనును, మా యన్నగారైన శ్రీ లక్ష్మణమూర్తి ఎమ్. ఏ., గారును విరమించితిమి.

ఇచట పరిసరములబట్టి చూచిన ఇది రెడ్డి రాజులదో, లేక కాకతీయులదో కావచ్చునని తెలియు చున్నది. ఇది మా స్వగ్రామము గావున అచటికి వెళ్లినపుడెల్ల ఆ శాసన స్తంభమును జూచి బాధ పడుట తప్ప వేరేమి చేయగలము. పశువులు రుద్దు కొనుట, రైతులు దీని వెంటనే వ్యవసాయ పరి కరముల నుంచుటయు, మార్గమున నుండుటయు మొదలగు కారణములవల్ల, ఈ శాసనాక్షరములు కొన్ని కొన్ని భ్రష్టత్వ మందినవి.

ప్రభుత్వము వారు ప్రత్యేకముగ నిట్టి పురా వస్తు— శాసన, భూగర్భ పరిశోధనల జరిపించి చారిత్రక జ్ఞానము హెచ్చు చేయుచున్నను, ఈ ప్రకారముగనే మరుగుపడియున్న శాసనములెన్నియో గలవు. కావున ఈ శాసనమును తగు పరిశోధకులచే పరిశీలింపజేసి ప్రకటించిన అందు ఎన్నియో విషయములు తెలియును. వీని వలన చారిత్ర కులకును— మాకును అనగా ప్రజానీకమునకును ఎంతయో మేలు చేసిన వారగుదురని విశ్వసించు చున్నాను. శాసనముల గూర్చి ప్రత్యేక పరిశోధ నము (Ph. D) జరుపు వారు సైతము దీనిని తెలుసుకొనలేక పోవుట విచారకరము—

— శ్రీ రంగాచార్య.

## సమగ్రాంధ్ర సాహిత్యము :
## ఆరవ సంపుటము

(తొలిరాయల యుగము—పిల్లలమర్రి పినవీరభద్రుడు)

ఆర్యా!

శ్రీ ఆరుద్ర రచియించిన సమగ్రాంధ్ర సాహి త్యములో— ఆరవ సంపుటమున గల కవులలో పిల్లలమర్రి పినవీర భద్రుడున్నాడు. ఆ కవిని గూర్చి వ్రాయుచు, "మహామతి" అనే విశేషణాన్ని కొరవి గోపరాజు వాడినట్లు వ్రాయబడినది. కాని 1965 డిసెంబరు సంచిక 'భారతి'లో అది పెద్ద వీరన్నను గూర్చిగాని, పిన వీరన్నను గూర్చి కాదని నిరూపింప బడినది. (సమగ్రాంధ్ర సాహిత్య విమర్శ—లో.)

ఇక ప్రస్తుతపు అభూత కల్పన మేమన— "సీమంతినీ పరిణయము" లేక "సీమంతినీ కల్యా ణము" అనబడే గ్రంథము— "పిన వీరయ్యకు ఏడెనిమిది తరాల తరువాతనున్న పెనుమళ్ల సోమయ్య "సీమంతినీ పరిణయము" అనే కావ్యం వ్రాశాడు" అని తెలిపి అధోదీపిక (Foot-notes) లో "అముద్రితము— R—513— మద్రాసు— ప్రాచ్య లిఖిత గ్రంథాలయము" అని వ్రాయబడినది. ఈ గ్రంథము, విశ్వవిద్యాలయ గ్రంథాలయములలోను, తదితర ప్రాచీన గ్రంథాలయములలోను విస్పష్ట ముగ గన్పట్టుచు, ప్రజోపయోగకారి యగు చున్నది. ఇది సాహిత్య చరిత్రము వ్రాయుకాల మున గ్రంథకర్తకు ఏల లభ్యము కాలేదో తెలియ కున్నది. ఇది, "అముద్రితాంధ్ర గ్రంథ సర్వ స్వము—౨" లో "సీమంతినీ కల్యాణము"—పెనుమళ్ల సోమ మంత్రిచే వ్రాయబడి శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షర శాలయందు ముద్రిత మైనది. (పిఠాపురము—చిత్రాడ). దీని సంపాద కులు శ్రీ చెలికాని లచ్చారావు గారు. ఇది మొదటి కూర్పున ముద్రితము. దీని పీఠిక గూడ 30—3—1919 రోజున శ్రీ లచ్చారావు గారే వ్రాశారు.

కాన ఇట్టి విషయాలు గ్రహించి, సరి దిద్ది కనీసము రెండవ ముద్రణములో నైనను గ్రంథ స్ఖాలిత్యముల సవరించి, అనుబంధముతో

సహా సంపూర్ణముగా వేయనిచో, ఇది సమగ్రాంధ్ర సాహిత్య మెట్లగునో తెలుప వలసినదిగా కోరు చున్నాడ.

—ముదిగొండ వీరేశలింగము

## మారన మహాకవి కాలము

ఆర్యా,

1966 జులై 'భారతి' పత్రికలో శ్రీ చేకుమళ్ల కామేశ్వరరావు గారు పై పేరున నొక వ్యాసమును ప్రచురించిరి. అందు వారనేక విషయముల తెలిపి 'భారతి' పాఠకులకు నూతన విషయముల పరిచయము చేసినందులకు కృతజ్ఞత లందచేయుచు, అందు నాకు గల్గిన సంశయముల తెలుప నుద్యుక్తుడ నైతిని. అంగీకరింప గోరు చున్నాడను.

వ్యాసకర్తగారీవ్యాసమున మారనను గూర్చి స్వల్పముగనే తెలిపిరి. అందు వారు చేసిన కాల నిర్ణయ చర్చ సమంజసమే కావచ్చును. కాని తిక్కన— కేతనల గ్రంథరచన— కృతి పతిత్వములం గూర్చియే దాదాపు 5 పుటలు గలదు. మారనను గూర్చి వ్రాయునపుడు వీరిని గూర్చి వ్రాయ వలసినదే. ఐనను ఇంత విపులముగ చర్చించుట యనవసర మేమో ననిపించు చున్నది.

కేతనకు తిక్కనపై గల యభిప్రాయమును గూర్చి వ్యాసకర్త "తిక్కన యొక్క హరిహరనాథ భక్తిని గూర్చి కేతనకవి తన గ్రంథములో దెలుప లేదు. కాబట్టి నాటి కింకను తిక్కన మహాకవి భారత రచన ప్రారంభింపలేదని వాదింప బూనుట వ్యర్థము. కేతనకవికి అట్టి సూక్ష్మములతో సంబంధము లేదు. అతడు స్థూలాంశములనేగాని సూక్ష్మాంశముల జోలికి పోడు" (పేజి 19) అని వ్రాసిరి. కేతన తిక్కనగారికి దశకుమార చరిత్రము సంకిత మిచ్చు సమయము వరకు అతడు (తిక్కన) "రాచపదవుల యందు"న్నట్లుగను, రాజకీయ వ్యవహారముల యందున్నట్లుగను చెప్పెను. అప్పటి వరకు తిక్కన మహాభారత రచనను గూర్చి ఆలోచించుటయే లేదుగదా? అట్టి సమయమున తిక్కన యొక్క "హరిహరనాథ భక్తి"ని గూర్చి కేతన యే విధముగ జెప్పును? తిక్కనగారికి రామాయణ రచన తరువాత అనగా భారతరచనాకాల సమయము వరకు మనః ప్రవృత్తి యెంతయో మారినది. రామాయణము నందు తనను గూర్చి హెచ్చుగా చెప్పుకొనిన తిక్కన, భారత రచన వరకు వినయమూర్తిగను, "భేదములేని భక్తి" గలవాడుగను గోచరించు చున్నాడు. ఇదిగాక రామాయణాది యందు ఏన్నియో విషయముల దెల్పిన తిక్కన భారత రచనాదియందు నే విషయముల గూర్చియు తెలుపలేదు. (తెలుప వలసిన యగత్యము కలుగ లేదేమో?) కావున 'దశకుమార చరిత్రము' సంకితము పొందు నప్పటికి తిక్కన భారత రచనయే చేయలేదనియు (ప్రారంభము గూడ చేయలేదు) ఏ కొద్దిగనో భారత రచన నారంభించినచో కేతన తిక్కనను గూర్చి యెన్నియో విషయముల దెల్పిన వాడు ఈ విషయము నేల తెల్పడు? కావున దశకుమార చరిత్ర సంకితము బొందునప్పటికి తిక్కన భారత రచన మారంభింప లేదని తెలియు చున్నది. కావుననే తిక్కన యొక్క 'హరిహరనాథ భక్తి'ని గూర్చి కేతన తెలుపలేదు. తెలుప వలసిన యగత్యమును గూడ లేదేమో? కాని రచయిత గారన్నట్లుల నిది "సూక్ష్మ విషయము" గాదు. (హరిహరనాథతత్వము). ఏలనన తిక్కన గారు మహాభారత రచన నారంభించువరకు దేశమునందు శివ— కేశవ తారతమ్యములు, మత వైషమ్యములు, రాజకీయ వాతావరణములు మొదలగునవి ప్రజలను భీతావహులుగా చేయుచున్న సమయము. అట్టితరి తిక్కనగారు శివునిగూర్చి చెప్పినను, లేదా విష్ణుమూర్తిని గూర్చి చెప్పినను ప్రమాదము కలుగు నట్లుండెను. అందుకే తిక్కన గారు 'వైదిక మార్గ నిష్ఠమగు వర్తనమును' నిర్వహించుచు, 'భేదము లేని భక్తి' గలవాడయి హరి

హరులను ఏకవిధముగ భావించి 'కిమస్థిమాలాం...' ఇత్యాదిగా సంబోధించెను. ఇట్టి విషయముల బహు సూక్ష్మముగ బరిశీలించినగాని తిక్కనగారి హరిహరనాథభక్తికి కారణము లభించదేమో? కాని వ్యాసకర్త గారన్నట్లు ఇది 'సూక్ష్మవిషయము' గాక 'స్థూలవిషయమే'నని నా యూహ. ఇట్టి విషయమును కేతన చెప్పక పోవుటకు కారణము? భారత రచన యారంభమే గాలేదనియు, తిక్కనకు నీ రచనపై యూహయే లేదన్నట్లును వ్యక్తమగుచున్నది. (చూ. ఆంధ్రకవితరంగిణి 2 భా. 215,216 పుటలు, భారతి 1964 డిశంబర్, 67,68 పుటలు.)

శ్రీ కామేశ్వరరావుగారు తిక్కన "సోమయాజిత్వము"ను గూర్చి చెప్పుచు "కేతన తిక్కనకవి యొక్క యాజికత్వమును గూర్చి చెప్పిన పొగడికలు" అని పదునొకంటిని(11) ఉదాహరించిరి. విస్తరభీతిచే వానిని నిందు జేర్చనలేదు. ఆ వాక్యముల వ్రాసిన కేతన తిక్కనకు 'సోమయాజిత్వము' కలిగినట్లు చెప్పలేదు. సోమయాగమనునది ప్రత్యేక యాగవిశేషము. ఇదిగాక ఇంకను కొన్ని యజ్ఞములు గలవు. వానియం దేకొన్ని యైనను తిక్కన చేసియుండవచ్చును. కాని సోమయాగ మప్పటికి చేయులేదు. కావుననే కేతన తిక్కనను ప్రత్యేకముగ 'సోమయాజి' యని తన గ్రంథమున జేర్చనలేదు. కేతన చెప్పిన విశేషణములన్నియు, తిక్కనను గూర్చియు, అతనికి వేదవిద్య యందుగల యభిమానాదుల గూర్చియు మాత్రమే కావచ్చునని తోచుచున్నది, కాని "తిక్కన దశకుమార చరిత్రము నంకితము పొందునప్పటికే సోమయాజియైనాడని నిరభ్యంతరముగ చెప్పుకొనవచ్చును" అని వ్యాసకర్తగారు వ్రాయుట సంశయాస్పదమేనేమో?

ఈ పై వాక్యము వెంటనే "అంతేకాదు. అతఁడు ఉత్తరరామాయణ కావ్యగద్యలోనే తాను సోమయాజినని చెప్పుకొన్నాడు" అని వ్రాసిరి. ఈ వాక్యము పూర్తిగా పొరపాటు. నేను చూచిన ఉత్తర రామాయణాశ్వాసాంత్య గద్యల యందు సోమయాజి యను పదములేదు. గద్య మీప్రకారముగ గలదు. "ఇది శ్రీమదుభయ కవిమిత్ర కొమ్మనామాత్య పుత్ర బుధారాధనవిధేయ తిక్కన నామధేయ ప్రణీతంబయిన యుత్తరరామాయణంబను మహాకావ్యంబునందు... ఆశ్వాసము" అని మాత్రమే గలదు గాని 'సోమయాజి' యని మాత్రములేదు సరిగదా, గ్రంథాది యందుగాని గద్యయందు గాని యట్టి యర్థమును స్ఫురింపజేయు వాక్యములు గూడ లేనట్లు వ్యక్తమగుచున్నది. వ్యాసకర్తగారు రామాయణాశ్వాసాంత గద్యను గూర్చి వ్రాసిన వాక్యమును చూచిన, వారు రామాయణమును చూడకయే ఈ పై యభిప్రాయమును వ్యక్తపరచినట్లు దెలియుచున్నది.

తిక్కన రామాయణ రచన వరకు "హరిహర పద్మగర్భులను నాదికవీంద్రుల నాత్మసత్కవీశ్వరులను భక్తిగొల్చి తగనారికృపం గవితావిలాస విస్తర మహనీయుడై"నట్లును, "వివిధ విద్యాపరిశ్రమ వేది" యనియును, 'సరస బహుమాన విరచనాశాలి' యనియు తెలియుచున్నది. కాని రామాయణ రచనమునకే 'సోమయాజి' యని మాత్రము తెలుపబూనుట సాహసమే. కావున వీరు వ్రాసిన వాక్యము పొరపాటనిపించుచున్నది.

—శ్రీ రంగాచార్య.

## నాట్యకళ - గీర్వాణ రూపకము

ఆర్యా,

1937 లో విజయవాడలో జరిగిన 'ఆంధ్ర నాటక కళాపరిషత్తు' ఆరవ వార్షికోత్సవమునకు అధ్యక్ష పీఠ మలంకరించిన శ్రీ పింగళి లక్ష్మీకాంతం కవిగారు ఆంధ్ర నాటక రంగమును గూర్చి సవివరముగా యుపన్యసించి యున్నారు. ఆ ప్రసంగ వ్యాసము, ఇతరములు కొన్ని 'గౌతమ వ్యాసములు' అను పేర నొక గ్రంథముగా ముద్రించి యుండుట సర్వజన విదితమే. నాట్యకళ దశాపరిణామముపై ముచ్చటిస్తూ శ్రీ వారు నృత్త, నృత్య, నాట్యములకు నిర్వచనములనిచ్చి, యవి సమానార్థకములు కావని సహేతుకముగా చర్చించి యున్నారు.

ఇది యిట్లుండ, భారతి ఆగస్టు సంచికలో శ్రీమతి ముష్టి వెంకట లక్ష్మీ దేవిగారు తమ 'నాట్య కళ— గీర్వాణ రూపకము' అను వ్యాసమునందు 'నృత్తాదికము' అను ఉప విభాగములో (చూ. భారతి పేజి. 6) నృత్త, నృత్య నాట్యములను గూర్చి వ్రాసిన యంశములెల్లయు శ్రీ పింగళి వారి 'ఆంధ్ర నాటక రంగము' నుండి అక్షరము పొల్లుపోక మక్కీకి మక్కీగా గ్రహింపబడినవని తెలుసుకొని ఆశ్చర్య పోయితిని. (నృత్తము నృత్యము నాట్యము అనెడి మూడు పదములను...... మొదలు కొని— మొదట త్రిస్వరాత్మకముగా యున్న గానము తుదకు సప్త స్వరాత్మక మగుట యిట్టిదే... అను వరకు). కాని రచయిత్రి యేలనో యీ యదార్థమును వ్యాస మందు పేర్కొనలేదు.

ఇతరుల వ్యాసములను యుపయోగించు నపుడు కృతజ్ఞతా పూర్వకముగా తద్వ్యాసకర్త నామము నుటంకించుట మర్యాద. కనీసము 'అది' స్వీయము కాదని యైనా పాఠకులకు సూచన చేయుట రచయిత్రి విధి. అంతటి అనౌచిత్యమునకు రచయిత్రి పాల్పడదను నమ్మికతో, సత్యము వెల్లడింతురు గాకయని భావించుచున్నాను.

—అల్లైన దుర్గారావు.

# గ్రంథ విమర్శలు

## జగద్గురు బోధలు

(5 వ భాగము)

(శ్రీ కంచి కామకోటి జగద్గురు శ్రీ చంద్రశేఖరేంద్ర స్వామివారి బోధలు. ఆంధ్రానువాదము: శ్రీ కాటూరి వేంకటేశ్వరరావుగారు. పరిశోధకులు: శతావధానులు శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు. ప్రకాశకులు: సాధన గ్రంథమండలి, తెనాలి. వెల రు. 2—00)

ఇది శ్రీ కంచి కామకోటి జగద్గురు శ్రీ చంద్రశేఖరేంద్ర స్వామివారు చేసిన బోధలలో కొన్నిటికి కల్పింపబడిన గ్రంథరూపాలలో ఐదవ సంపుటము.

ఆంధ్రానువాదకులు మహాకవి కీ. శే. శ్రీ కాటూరి వేంకటేశ్వరరావుగారు. పరిశోధకులు శతావధానులు, పండితశ్రేష్ఠులు, విద్యాతపస్వులు ఐన శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు. ఆంధ్ర జిజ్ఞాసువులకు ఉత్తమగ్రంథాలు అందించుచున్న సాధన గ్రంథమండలి వారు ప్రకాశకులు. ఇన్ని విధముల పుష్టివంతమైన ఈ గ్రంథము ఉత్తమంగా ప్రకాశిస్తున్నది.

శ్రీ స్వామివారు మధురవాగ్వ్యాఖ్యానులు. బోధనా చతురులు. శ్రీవారు ద్రవిడభాషలో చేసిన ఉపన్యాసాలను వారి శిష్యులైన శ్రీ ఆర్. కృష్ణస్వామి అయ్యరు ఆంగ్లీకరించగా వానిలో కొన్నిటిని గణేశ్ అండ్‌కో (మద్రాసు)వారు ప్రకటించారు. అందులోని పదునేడు ఉపన్యాసాలు శ్రీ కాటూరివారు తెలుగు చేయగా పత్రికలలో వచ్చినవి. వాటి పునర్ముద్రణం ఈ సంపుటం.

శ్రీ కాటూరి వారి మధురమైన శైలి, శ్రీ వేలూరివారి సులభసుందరమైన అర్థవివరణం ఈ గ్రంథాన్ని ఆంధ్రభాషాభిమానులకు ప్రీతిపాత్రం చేశాయి. విషయ గాఢత్వం అక్కర లేకుండానే పుస్తకానికి ఇన్ని మెరుగులు ఉన్నాయి.

ఈ బోధలు సభలలో సామాన్య జనుల కుద్దేశింపబడుటచేత కాబోలు అతిసామాన్య విషయములను గురించి ప్రసంగములు జరిగినవి. ప్రసంగ ధోరణి అసామాన్యంగా ఉన్నమాట కూడా వాస్తవమే. కాని ప్రసంగాలలో విషయనిష్ఠ గోచరించదు. బోధలలో చాలా వాటికి—ఆయా శీర్షికలకు—ప్రసంగ విషయములకు సమన్వయమేలేదు.

"వేద విహిత ధర్మమే శ్రేయఃప్రాప్తి హేతువు" అనే శీర్షిక గల బోధలో తాము శ్రీ కామకోటి పీఠాన్ని ఏబదేండ్లుగా సేవించితిమనీ— తమకు ఇకముందు కర్తవ్యం కూడా స్వకర్మానుష్ఠానమే అనీ— అది వేద విహితమైనదనీ చెప్పబడి ఉన్నది. ఈ బోధలో శ్రేయః ప్రాప్తి హేతువెట్లో వివరణములేదు. శ్రీవారి కర్మానుష్ఠాన స్వరూపమెట్టిదో చెప్పబడలేదు. ఆత్మకథా రూపమైన ఈ ప్రసంగంలో బోధ ఏమున్నదో వివరింపబడలేదు. తను స్వకర్మానుష్ఠానమును ప్రసక్తికి తెచ్చినప్పుడు, దాని స్వరూప మెట్టిదో చెప్పవలెను కదా! అది జరుగ లేదు.

నిర్లిప్తత, సంయమనము, రాగద్వేష రహితత్వము, అరిషడ్వర్గముపై జయమునంటి వాటికి ఆశ్రయమైన సన్న్యాసాశ్రమములో కర్మానుష్ఠానమునకు గల స్థానమెట్టిది? సన్న్యాసాశ్రమములో కర్మ సన్న్యాసమా లేక కర్మానుష్ఠానమా?

"య దహరేవ విరజేత్ త దహరేవ ప్రవ్రజేత్" (ఏ దినమున విరక్తి భావము పుట్టునో ఆ దినమే సన్న్యాసము స్వీకరింపవలెను) అని ఉన్నది కదా? విరక్తి అనగా కర్మానుష్ఠానమా? వైరాగ్యము లేక, మమకార విసర్జనము లేక—(ఈ మమకారము ఉన్నతస్థానీయమైనది కావచ్చును) తురీయాశ్రమమగునా?

మన్వాదిస్మృతుల ప్రకారము సన్న్యాసము స్వీకరించినవారు నాలుగు విధములుగా నున్నారు. వారు కుటీచక, బహూదక, హంస, పరమహంస అనువారు. ఈ క్రమంలో ముందు చెప్పబడిన వారికన్న తరువాత వారు క్రమంగా ఉన్నతులు. స్వాశ్రమ ధర్మపాలనముతో బ్రహ్మప్రాప్తికి ప్రయత్నించువారు కుటీచకులు. వీరు కుటీర నివాసులు. సర్వకర్మ త్యాగము చేసి జ్ఞానాభ్యాస ప్రధానులు బహూదకులు. ఏడు (బహు) గృహములలో భిక్షను స్వీకరించువారు వీరు. జ్ఞాన

నిష్కులు హంసలు. జ్ఞానపరిణతివల్ల నిష్క్రియులు పరమహంసలు. మనుస్మృతి వాక్యములే శ్రీ శంకర భగవత్పాదాచార్యుల వారికి కూడ ప్రమాణములు. స్మృతి వాక్యము లిట్లుండగా, ఈ గ్రంథకర్తగారైన శ్రీస్వామివారు తమకు కర్మానుష్ఠానమున్నదని చెప్పుచున్నారేల? స్మృతి విరుద్ధభావాలను బోధలలో ప్రబోధించునపుడు-విపులార్థస్ఫురణము చేసి వైరుధ్యమును తొలగించవలసిన బాధ్యత వారికున్నది.

మఠామ్నాయమహానుశాసనములను అనుసరించు మహామ్నాయ మఠములకు అధిపతులైనవారు బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ ఆశ్రమముల వారికే గాక, ఇతర సన్న్యాసులకు గూడ మార్గదర్శకులై కర్తవ్య నిర్దేశము చేయవలసి ఉన్నది. సామాన్య సన్న్యాసుల ఏకాంతసేవన, స్నాన, శౌచ, భిక్షాదులలో ఉత్తమాచార నిరూపణము చేయవలసినది మఠాధిపతులు. మరి వీరు కర్మానుష్ఠానమో కర్మసన్న్యాసమో శంకాసంకులము చేసిరి.

"వేద విహిత ధర్మమే శ్రేయః ప్రాప్తి హేతువు" అని శీర్షిక స్వీకరించి వేదవిహిత ధర్మమెట్టిది? శ్రేయఃప్రాప్తికి హేతువెట్లు కాగలదు? ఈ విషయముల ప్రస్తావనే లేదు.

'శబ్దబ్రహ్మవాదం' అనే బోధలో ఓపురికార్డులను గురించి ఉన్నది. అటువంటి చిల్లరమల్లర సంగతులే ఉన్నాయి. శబ్దబ్రహ్మవాదంలో ఉన్న సిద్ధాంత భావాల విశదీకరణంగాని—ఆ సిద్ధాంత పరామర్శగాని, ఆ సిద్ధాంత వ్యాఖ్యానంగాని ఈ బోధలో లేవు.నాలుగు ప్రధానాద్వైత సిద్ధాంతములలో (శబ్దాద్వైత, శాక్తాద్వైత, శివాద్వైత, బ్రహ్మాద్వైత) భేదములేమిటో చెప్పబడలేదు. వైయాకరణులచే ప్రతిపాదింపబడిన శబ్దబ్రహ్మవాదమును పూర్వు లెట్లు వివరించిరో దీనియందు లేదు. ఈ వాదాన్ని ప్రవర్తింపజేసిన వైయాకరణులలో ముఖ్యుడైన భర్తృహరి సంగతిగాని, ఆయన గ్రంథమైన వాక్యపదీయమును గురించిగాని స్పృశింపబడలేదు. అసలీ బోధలో శబ్ద తత్త్వమే నిత్యమైన పరసత్యముగా ప్రతిపాదింపబడినదనిగాని, ఆ చరమ సత్యమే పరబ్రహ్మమనిగాని చెప్పబడలేదు. "అనాది నిధనం బ్రహ్మ శబ్దతత్త్వం యదక్షరమ్ వివర్తతే అర్థభావేన ప్రక్రియా జగతో యతః" ఇటువంటి ప్రసిద్ధ శ్లోక భావాలనైనా అనువదించుట జరుగలేదు. శబ్దతత్త్వము (Logos) వ్యాకృతమై ప్రపంచ నానాత్వమైనదనిగాని-ఆ తత్త్వము సత్యత్వ అనన్యత్వ లక్షణవంతమైనదనిగాని-ఆ తత్త్వమే మూలశబ్ద (ప్రణవ)హేతువైనదనిగాని సహజ, వికృత ప్రత్యయములు, విషయములు శబ్దబ్రహ్మ యొక్క వివర్తములనిగాని ఈ బోధలో చెప్పబడలేదు. ఈ బోధలో దోషరహితమైన శబ్దబ్రహ్మజ్ఞాన సిద్ధాంత వ్యాఖ్యానము లేకున్నప్పటికీ శీర్షిక దోషవిహితముగా నుంచబడినది.

'మానసపూజావిధానం' అన్న బోధలో మానస పూజామార్గమైన ఆత్మయజ్ఞవ్రతమును గురించిగాని, భావనోపనిషత్తును గురించిగాని ప్రసక్తిలేదు. శీర్షికను బట్టి విషయమిమ్మ కనబడదీ బోధలో.

"శాస్త్రం విధించిన సన్న్యాసాశ్రమం" అన్న బోధలో "భారతీయ సాధుసమాజ్"ను గురించి విమర్శ ఉన్నది. ఈ విమర్శ రాజకీయముల అంతస్థులో జరిగినది. ఇట్టి గ్రంథములో ఆ విమర్శకు స్థానముండవలసినది కాదు. "భారతీయ సాధుసమాజ్" స్థాపన గురించి శ్రీ స్వామివారు చేసిన విమర్శ—శ్రీ స్వామివారు ఈమధ్యనే మద్రాసులో స్థాపించిన మఠసన్న్యాసుల సమాజానికి కూడా వర్తిస్తుంది. ఇతరుల యందు దోషముగా నున్నది తనయందు కాదా? అసలీ విమర్శ ఆధ్యాత్మిక బోధ కాగలుగునా?

"అంతశ్శౌచము" అన్న బోధలో అంతరంగ శౌచము అవసరమని ఒక వాక్యమున్నది. అంతవరకు బాగానే ఉన్నది. అంతవరకే శీర్షికతో సంబంధము. తరువాత శాఖాచంక్రమణమే. అంతశ్శౌచ మనగానేమి? దానికి సాధనామార్గము లెట్టివి? కర్పూర మంజరి మొదలగు యోగభూమికల భావములేమి? ఇట్టి విషయములీ సందర్భములో జగద్గురువుల వారి ప్రసంగమునకు రావచ్చునని ఆశించువారి భావములకు ఆశాభంగమే.

"ఆత్మార్పణము" అన్న బోధలో సర్వమూ భగవదర్పితము చేయవలయునన్న భావనకు ఉదాహరణగా శ్రీ భగవత్పాదులవారి "ఆత్మాత్వం గిరిజామతిః" అనే శ్లోకం ఇవ్వబడినది. ఆ శ్లోకములో శ్రీ భగవత్పాదులవారు ప్రతిపాదించినది శివాద్వైతమా? లేక ఆత్మార్పణమా? "భక్తివలన ముక్తి" అన్న బోధలో ఉన్న విషయమేమనగా శ్రీ శంకర భగవత్పాదాచార్యుల

వారి సౌందర్యలహరిలోని "భవాని త్వం దాసేమయి" అను శ్లోకమునకు వ్యాఖ్యానము. ఈ శ్లోకములోని విశేషాంశమేమనగా "భవాని త్వన్" అను పద ద్వయానికి గల అర్థము మహావాక్యార్థమే అగుట. అట్టి అర్థమును తెలియక ఉపయోగించినను—మహావాక్యము యోగ్యముగ తాకినను, యోగ్యముగాక తాకినను దహించునట్టి అగ్నివలె తెలిసి ఉపయోగించిన వారికిని తెలియక ఉపయోగించిన వారికిని తుల్యఫలము లిచ్చుననుట.అద్వైత పీఠాధిపతుల వ్యాఖ్యానములో మహావాక్యార్థ ప్రసక్తి ఉండవచ్చునని తలచుటలో దోషములేదు. కాని శ్రీ స్వామివారి వ్యాఖ్యానము ఈ శ్లోకమందున్న మహావాక్యార్థము జోలికి పోలేదు. అసలీ శ్లోకములో మహాకవులైన శ్రీ భగవత్పాదాచార్యుల వారు, రసధ్వనిచేత మహావాక్యార్థమే భక్తికి పైకక్ష్య అనిన్ని—అనగా 'ఈశ్వరానుగ్రహాత్ ఏవ పుంసాం అద్వైతవాసనా' 'జ్ఞానదేవతుకైవల్యమ్' వంటి అనేక సాంప్రదాయిక ప్రవచనముల అర్థస్ఫురణము చేసినారు. అందుచేతనే శ్రీ భగవత్పాదులు శ్రీ వాల్మీకి శ్రీవ్యాసులతో తుల్యులైన మహాకవులు. ఆలంకారికముగా జ్ఞానమార్గము భక్తికన్న ఉన్నతమైనదని ఈ శ్లోకము ధ్వనింపచేయుచున్నదని శ్రీస్వామివారి బోధలో లేదు. జ్ఞానమార్గపు ఔన్నత్యాన్ని చెప్పే శ్లోకాలతో "భక్తి వలన ముక్తి" అన్న బోధలు అద్వైతాచార్యులమని చెప్పుకొనువారు చేయుట ఆశ్చర్యకరమైన విషయము. ఇట్టి శ్లోకముల వ్యాఖ్యానములే విద్వత్తునకు నికషోపలములు.

"ఏది నిజమైన ఈశ్వరారాధన" అన్న బోధలో మహాత్మగాంధిగారిపైన విసుర్లు ఉన్నాయి.(ఆ విసుర్లు నిజమైన ఈశ్వరారాధనా యేమి?) "గాంధిగారు తారతమ్యం తెలియనివాడట." అందుచేత ఆయన యత్నములు ఫలించినవి కావుట! ప్రాచ్య ప్రతీచీ దేశాలలో, భూత వర్తమాన కాలాలలో అపూర్వమైన విధంగా రాజకీయాలలో పారమార్థికతను సమ్మిళితం చేసి మన దేశానికి స్వాతంత్ర్యాన్ని సంపాదించిన మహాత్ముని భారతజాతి 'పిత'గా వరించినది. ఆయన ఉపనిషన్మహర్షుల వంటివాడు. గాంధిగారి యత్నములు ఫలించలేదట! ఏ యత్నములు?

'కళద్వారా చిత్తశాంతి' అనే బోధలో 'చిత్తశాంతి'ని గురించిగాని కళను గురించిగాని కళారాధన యోగమెట్లగునో వివరము గాని (Art as a yoga—కవితైవయోగః) చెప్పబడలేదు.

ఆంధ్రదేశము ధర్మనిష్ఠగల దేశము. సహన శీలమున్న దేశము. భారతదేశములో ఇతర ప్రాంతాల వారు శ్రీ భగవత్పాదాచార్యుల వారితో వాదించి, ఓడింపబడినవారై, ఆచార్యుల వారి జగద్గురుత్వాన్ని అంగీకరించారు. ఆంధ్ర పండితులు ఆచార్యస్వామి దర్శనము చేయగానే భగవత్పాదులు అపరశంకరులనీ జగద్గురువులనీ గ్రహించి పాదాభివందనం చేశారు. ఇట్లా శంకర విజయంలో ఉన్నది. కాబట్టి శంకరపక్షపాతమైన ఆంధ్ర విద్వల్లోకం అద్వైతయతులందు గౌరవభావ మెల్లప్పుడూ ప్రదర్శిస్తూనే ఉంటుంది. సాధన గ్రంథమండలివారు బహుగ్రంథ ప్రకటనచేత ఆంధ్ర జిజ్ఞాసువుల కృతజ్ఞతను గడించుకున్నారు. అట్టి వారిచేత ప్రకాశయోగ్యమైన ఈ గ్రంథమును ఆంధ్రలోకము ఆదరించగలదు.

గ్రంథము నెవ్వరు రచించిరనిగాక అందున్న విషయమెట్లు నిర్వహింపబడినదన్న విషయమే విమర్శకునికి కావలసినది. విషయ పరామర్శయే కర్తవ్యము. కర్తవ్యనిర్వహణ దృష్టితో వ్రాయబడిన ఈ మాటలను ధర్మనిష్ఠమైన విద్వల్లోకము మన్నించునుగాక. "కర్తవ్యమేవ కర్తవ్యం ప్రాణైః కంఠగతైరపి। అకర్తవ్యం నకర్తవ్యం ప్రాణైః కంఠగతైరపి॥"

—శ్రీ పాదుక.

## జీవన సంగీతం

[నవల. రచన : 'హృదయం'. ప్రచురణ: ప్రేమ్ చంద్ పబ్లికేషన్స్, విజయవాడ. పుటలు : 374. మూల్యం : రూ 5/—]

కథానాయిక ప్రియంవద బావను ప్రేమించింది. తండ్రి ఆమెను బ్రహ్మానందం అనే యువకుడికిచ్చి పెళ్లి చేశాడు. బ్రహ్మానందం అమృత హృదయుడు. ప్రియంవద బావ అయిన విఘ్నవర్ధనునికి ప్రాణమిత్రుడు. ఈ ముగ్గురి మధ్య స్నేహానుబంధం కథలో ఒక ఘట్టం. బ్రహ్మానందం మరణించాడు. ప్రియంవద బావను వివాహం చేసుకొన్నది. సంతానప్రాప్తి అయింది. కాని విధివశాత్తూ ఆ బిడ్డ మరణించాడు. విఘ్నవర్ధనుడు ఆ దుఃఖాన్ని భరించ

లేకపోయాడు. మళ్లీ సంతానం కలిగినా ప్రథమ శిశువు స్మృతి అతణ్ణి బాధిస్తూనే వుంది. చివరకు ఆరోగ్యం క్షీణించి అతనూ మరణించాడు. ఇది రెండో ఘట్టం. రెండవసారి భర్తృవిహీన అయిన ప్రియంవద రోగగ్రస్తుడైన బిడ్డతో పినతండ్రిని వెదుక్కుంటూ శ్రీకాకుళం వెళుతుంది. పినతండ్రి కనిపించడు. శ్రీకాకుళంలో ప్రభాకరుడు అన్న వివాహితుని ఆశ్రయింపొంది తన బిడ్డ మరణించగా అతణ్ణి చేపట్టుతుంది. ప్రభాకరుని భార్య ప్రభావతి పుట్టింటి నుంచి తిరిగివచ్చి ప్రియంవదపట్ల సవతి మాత్సర్యాన్ని చూపుతుంది. ఆమెకు ప్రేమయొక్క వైశాల్యాన్ని నచ్చచెప్పబోయి విఫలురాలై, తన నిజాయితీని నిరూపించుకోడానికి ప్రియంవద యిల్లువదలి వెళ్లిపోతుంది. వెళ్లేనాటికి ఆమె నిండుచూలాలు. ఇది మూడోఘట్టం. కొన్ని సంవత్సరాలతర్వాత, ప్రియంవద బిడ్డ యౌవనవంతుడయాక ప్రభాకరుని కుటుంబంతో తల్లీ కొడుకుల పునస్సమాగమం జరుగుతుంది. అది చివరి ఘట్టం. కథ మంగళాంతం. దీన్ని 'ప్రియంవద కరుణ గాథ' (ఉపశీర్షిక) అనడం కంటె 'ప్రియంవద ప్రేమగాథ' అనడం బాగు. ప్రతి ఘట్టంలోనూ 'మరణం' ద్వారానే కథ మలుపు తిరగడం గమనిస్తే, రచయిత కల్పనా సామర్థ్యం ఏపాటిదో తెలుసుకోవచ్చు!

పోతే పై కథకు మూలాధారమైన విశ్వాసం ఒకటున్నది. సెక్స్ విషయంలో అసూయ, మాత్సర్యం బొత్తిగా అనవసరం. హృదయాన్ని విశాలపరచుకుంటే, ప్రేమించడం నేర్చుకుంటే, అందరూ అన్యోన్యంగా ఉండవచ్చు. ఈ భావాన్ని నవలలో పదే పదే (127, 210—211, 266, 274 పుటలు) చెప్పడం, ఉపాఖ్యాన సహితంగా చెప్పడం జరిగింది. చివరకు 'ప్రేమే దైవం' అంటూ అవకతవగా దాన్ని గాంధిగారి 'సత్యాహింసల'తో ముడిపెట్టడమూ జరిగింది. (288—289). ఆ అవకాశాన్ని దొరకపుచ్చుకుని నేడు దేశంలో పెచ్చు పెరిగిన ధన వ్యామోహం, అవినీతి, రాచకీయాల్లో కుళ్లు వగైరా విషయాలమీద రిమార్కులు పాస్ చెయ్యడం కూడా కద్దు. ఇదంతా ఒకవిధమైన అమాయకత్వం. కాకపోతే అజ్ఞానంక్రింద జమకట్టుకోవాలి. తాత్త్వికమైన విచారణచేసే మేధాశక్తి కొరవడినప్పుడు దాని జోలికి పోవడం మంచిదికాదు! నవలలో పైరకంరచన నవల స్థాయిని చాలవరకు తగ్గించింది. ప్రియంవద పాత్ర పోషణలో లోపం లేదు. ఆమె కరుణగాథ లేక ప్రేమగాథ ఏ విధంగానూ ఎబ్బెట్టుగా లేదు. కాని ప్రియంవదను ఉదాహరణగా లేక ఆదర్శంగా తీసుకుని వివాహ వ్యవస్థనుగూర్చికాని సెక్స్ ప్రవృత్తినిగూర్చికాని సామాజికంగా లేక తాత్వికంగా సిద్ధాంతీకరించబోవడమే సమంజసంగా లేదు. ప్రియంవద అసాధారణ వ్యక్తి. ప్రేమించిన వాళ్లను కోల్పోవడమేమిటి, మళ్లీ మళ్లీ ప్రేమించడమేమిటి—ఆమెకే సరిపోయింది! "ప్రేమించు. హృదయాన్ని విశాలపరచుకో" అంటూ బోధించడం సులువే, కాని మానవ ప్రకృతి, ముఖ్యంగా సమాజం అనే చట్రంలో ఒత్తిడి పడే మానవ ప్రకృతి, అంత సులువుగా 'ప్రేమించు' అనే నినాదంతో ఉన్నట్లుండి మారిపోదు. మారిపోతుంది అని ఊహించడం కేవలం సుందర స్వప్నం—Utopianism. స్వర్ణయుగాన్ని గూర్చిన కలలకీ (Utopianism), అభ్యుదయానికీ (Progressionism), గల విభేదాన్ని తెలుగు రచయిత లింకా అవగాహన చేసుకోకపోవడం దురదృష్టం. "If to do were as easy as to know what were good to do, chapels had been churches, and poor men's cottages princes palaces... The brain may devise laws for the blood, but a hot temper leaps over a cold decree..." (Shakespear). ప్రియంవద వంటి పాత్ర సృష్టిద్వారా జీవన సమస్యల మీద ఒక క్రొత్త దృష్టిని కలిగించడమే నవల ఉద్దేశమైతే, ఆ ఉద్దేశానికి భిన్నమైన భావోద్రిక్తత(Sentimentalism)రచనలో చాలచోట్ల కనబడుతూ నవల స్థాయిని దిగజారేటట్లు చేసింది.

## అత్తగారి కథలు

(రచన: భానుమతీ రామకృష్ణ. ప్రచురణ: యం. శేషాచలం అండ్ కో. పుటలు: 142. వెం: రూ. 2—50 లు.)

సినీతార శ్రీమతి భానుమతికి తెలుగు సాహిత్యంలో ఒక స్థానం ఏర్పాటు చేయించింది ఆమె 'అత్తగారు.' శ్రీమతి భానుమతి వ్రాసిన యితర కథలను లోగడ 'భారతి'లో పరామర్శిస్తూ అవి

సాహిత్య గౌరవానికి అనర్హమని సోపపత్తికంగా నిరూపించటం జరిగింది. లక్ష్యశుద్ధి, సంయమం లేకపోవడంవల్ల కథారచన, హాస్యము ఎలా దెబ్బతిన్నాయో వివరింప బడింది. 'అత్తగారి పట్ల భయ భక్తులు కారణం కాబోలు, 'అత్తగారి కథ'ల్లో చక్కని సంయమం కనిపిస్తోంది! ఈ కథల్లో కథకురాలైన కోడలు మహాసున్నితంగా, రాచకీయ వేత్తలను తలదన్నే నేర్పుతో, తాటస్థ్యంగా, తప్పించుకొని తిరగ్గల సమర్థురాలు. ఆమె అత్తగారిని గూర్చి కథ చెప్పటంలో 'అత్తగారి'పట్ల తనకున్న భక్తి గౌరవాలకు ఎక్కడా—వాచ్యంగా—లోపం కలుగనివ్వదు. పోతే, అంతా వ్యంగ్యమే! పెదవి కదవకుండా, పళ్లు కనిపించకుండా నవ్వటమే! 'అత్తగారి' పాత్ర యొక్క వాస్తవికతకంటె, కోడలి కథాకథనం యొక్క వ్యంగ్య వైభవం, సున్నితమైన హాస్యం, ఈ కథల్లో సాహిత్యపరంగా ప్రధానమైన విలువ.

"అత్తగారు హాస్యపాత్ర అని వేరే చెప్పనక్కర్లేదు. మనస్థితికీ, వాతావరణానికీ మధ్య అసాంగత్యం (Incongruity) ఉండి, దాని ఫలితంగా ఘర్షణ సాగినప్పుడే హాస్యం ఉత్పత్తి అవుతుంది. అత్తగారి మనస్తత్వానికీ, బాహ్య ప్రపంచానికీ ఎక్కడా పొంతన లేదు. అందుకే ఆవిడ హాస్యం పుట్టిస్తుంది.." అని సూత్రీకరించారు శ్రీ కుటుంబరావుగారు. ఆయన యీ సంపుటికి వ్రాసిన పరిచయం, అత్తగారి పాత్ర కలం చిత్రం (Pen-picture), చక్కని సాహిత్య విమర్శ. పుస్తక పరిచయం అంటే ఎలా ఉండాలో అలా వుంది— యోగ్యతాపత్రం (Testimonial) లా లేదు. అసంబద్ధంగా, సత్య దూరంగా లేదు. ఇది ఈ పుస్తకానికి పట్టిన ఒక అదృష్టం, సాహిత్య అకాడెమీ బహుమతితో బాటు!

కాలగతిలో వడివడిగా అదృశ్యమై పోతున్న పాత్ర భానుమతి 'అత్తగారు'. మునిమాణిక్యం గారి 'కాంతం' ఈ పాటికే పాతబడి పోయింది. మారుతున్న సమాజంలో, క్రొత్త వన్నెలు దిద్దుకుంటున్న నాగరకతలో, పరివ్యాప్తమైన చదువు, పరిశ్రమలు, పట్టణవాసం, విదేశాలతో యినుమడించిన రాకపోకలు, వగైరా విషయాల ప్రభావంతో క్రొత్తదైన జీవన విధానంలో, 'అత్తగారు', పూర్వాచార పరాయణురాలైన ఒక బ్రాహ్మణ వితంతువు, సామాన్యమైన స్థితితో పుట్టి పెరిగిన మనిషి, పట్టణవాసంలో అర్జనపరుడై ధనికుడైన కొడుకు యింటిలో, చదువుకున్న కోడలి ముందు, తన అత్తగారి మర్యాదను, ఆధిక్యాన్ని నిలుపుకునేందుకు పడే తాపత్రయం ఈ కథల్లో కనిపిస్తుంది. అత్తగారి తాపత్రయం ప్రవాహానికి ఎదురీత. ఓటమిని, భంగపాటుని, అజ్ఞానాన్ని, అసమర్థతనీ కప్పిపుచ్చుకోడానికి ఆమె చేసే ప్రయత్నం మరికొంత పరిహాసానికి కారణమవుతూ వుంటుంది.

'బారిస్టరు పార్వతీశం'లో హాస్యానికి అలంబనము సన్నివేశము. 'అత్తగారి కథ'ల్లో హాస్యానికి ఆలంబనము పాత్ర పోషణము. ఆంగ్లంలో పి.జి.ఓడ్ హౌస్ సృష్టించిన బెర్టీ వూస్టర్, జీవ్స్ వంటి హాస్య పాత్రల కోవకు చెందుతుంది భానుమతి 'అత్తగారు'. నేడు బ్రిటన్‌లో జీవ్స్ వంటి బట్లరు కనిపించడు; ఇంకో పదేళ్ల తర్వాత మన దేశంలో భానుమతి 'అత్తగారూ' కనిపిస్తుందనే నమ్మకంలేదు!

—ఆర్. ఎస్.

## భాగ్యనగర కోకిల

[రచన: శ్రీ వాయుని సుబ్బారావు. ప్రతులకు: క్లాసికల్ బుక్ సెంటర్, నారాయణగూడ, హైద్రాబాదు—29. మూల్యము: 2 రూపాయలు.]

నవ్య సాహిత్యమును ఆంధ్రదేశమున వికసింప జేసిన సాహితీ సమితి సభ్యులలో ఒకరైన శ్రీ వాయుని సుబ్బారావుగారు షష్టి పూర్తి అయిన తరువాత రెండు సంవత్సరముల క్రితము వరకు ఆరు సంవత్సరముల మీద అప్పుడప్పుడు వ్రాసిన వివిధ శీర్షికల

తోడి రెండు వందలకు మించిన పద్యముల సంకలన గ్రంథమిది. పుస్తకమునకు పెట్టబడిన పేరు గ్రంథములోని మొదటి ఖండిక యొక్క శీర్షిక. భాగ్యనగరము చేరిన ఒక కవికోకిల ఆలపించిన కవితా గీతికల సంపుట మగుటను బట్టియు గ్రంథ నామమును భావింప వచ్చును.

ఇందు వ్యక్తిగతానుభూతి, వర్తమాన జాతీయ జీవన దర్శనము, భగవన్మయమైన చిత్తవృత్తి, మహాపురుష ప్రశంస ఇత్యాదులు కవితా వస్తువులుగా మూర్తీభవించినవి. స్వతంత్ర భారతాభ్యుదయ నామకమైన వర్తమాన ప్రజా ప్రభుత్వ ప్రవర్తనాలోకనము వలని అసంతృప్తి, పరమేశ్వరాభిముఖమైన చిత్తవృత్తి యొక్క అచ్ఛత— ఈ రెండును దాదాపు మొత్తము గ్రంథములోని కవితయందు సూత్ర బ్రహ్మముగా కనిపించుచున్నవి. పరిణత వయస్కుడును, మనస్కుడును అయిన శ్రీ సుబ్బారావుగారి భావుక హృదయము తాదృశమైన అనుభూతిని పొందుట సహజ సుందరముగనే యున్నది. కవి జాతీయోద్యమము నాటి వాడగుట చేత, నేటి పరిస్థితు లెంత నిరాశా నిస్పృహలను కలిగించుచున్నవైనను వాటికి తట్టుకొని, ఆగామి భవిష్య త్సుఖశాంతులను దర్శింప గలుగుచునే యున్నాడు. అందువలననే వర్తమాన పరిస్థితుల అసందర్భ లక్షణమును వివరించుటలో మార్చుకొని బాగుపడు డన్న హెచ్చరిక ఎక్కడికక్కడ చోటు చేసికొను చున్నది. శ్రీ సుబ్బారావుగారి కవి హృదయము పరమేశ్వర భావ పరీమళ తన్మయీభవనమును భజించుచు పోయిన ఒడుగులు భావౌన్నత్యముచేత, తీవ్రతచేత, సౌకుమార్యము చేత, రచనా శిల్ప రమ్య మర్యాద చేత పరమ రమణీయముగా నున్నవి.

భావ భావనాపథ మనాదిగా త్రొక్కుడుబడుచు వచ్చుచున్నదే అయినను ఆధునిక విజ్ఞాన ప్రభావ మవ్యక్త మధురముగా నచట నచ్చట చోటు చేసికొన్నది. ప్రియురాలి చూపులు రాకెట్లవంటివగుట అట్టిది. కర్మాగారపు కప్పురేకులలోడి యుపరి తలను బిరుసై దళమైన కేశముల నొక్కుల తలవలె నున్నదనుట స్వతంత్ర సృష్టియై కవి యొక్క పరిశీలన పటువైన బుద్ధి లక్షణమును చూపు చున్నది. సబ్బుమ్మ గడుపుకోవచ్చు— తెర వెనుక భాగవతము— నిండు ప్రాణము— పావమ్మున బోవు— ఏడు వారాల సొమ్ములు— నిల్చున్న పాళమ్ముగా— మేకవన్నె పులులు— మైలురాళ్ళ— చలికుట్లు కుడుచు— చుక్క యూడిపడినట్లు— బిక్కచచ్చి— కక్కుర్తి— ఈ మొదలైన తెలుగు విశిష్ట పద బంధములు చాల ఉచిత రమణీయములుగా శ్రీ సుబ్బారావుగారి కవితయందు చోటు చేసికొన్నవి.

ఉత్సాహ నవ వసంతోత్సారి తౌదార్య
మహిత సద్భావ సంపద చిగిర్చి
అంతర్బహిశ్శ్రుత వాభీల నైదాఘ
తప్త మానసము బద్ధలుగ పగిలి
అంతరంగ స్నేహ సంతతామృత వృష్టి
సంతుష్టి తీరంకషముగ పొంగి
రమ్యశృంగార శారదకళాజ్యోత్స్న, ర
సోద్రిక్త హృదయముల్లూత లూగి
పొలయు వార్ధక్య హేమంత పూర్వ శిశిర
పలనమున సర్వ వాసనల్ పండ బారి
చలిత వివిధ వికార సంసర్గ సార
శీల మీ జీవికకు నీడు చాలు వచ్చె.

కాలానుసారి సాగుదలయైన జీవితపు వికార లక్షణమును అరువది యేండ్ల అనుభవము మీద భావించిన కవి తాను జన్మించిన వికారి సంవత్సరము నామమును మనస్సున పెట్టుకొని వ్యాఖ్యానించుటను పై పద్యములో చూడ వచ్చును. సంస్కృతము తల పూవుగా తెనుగునుచేసి చేసిన సీసపద్యము లోని నవ్య కవి ప్రియమైన భంగిమ శ్రీ సుబ్బారావు గారి యందు పండబారిన ప్రాచీ నాధునిక పద్య రచనా పాటవమెంత జీర్ణించు కొన్నదో చూపుచున్నది. ఈ జీర్ణించిన లక్షణము మొత్తము పద్య రచన నలము కొన్నది. బహు విధముల పరిణత దశ నందు కొన్న శ్రీ నాయని సుబ్బారావుగారి కవితను సంకలనము చేసి పెట్టిన ఈ సంపుటము సాహితీపరులు నెమ్మది మీద పరిశీలింప దగినది. —క్షేమేంద్ర.

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by Radhakrishna
The Andhra Patrika Press 6 & 7, Thambu Chetty Street, Madras-1
Editor : S. Sambhu Prasad.